Licenced to Post without Prepayment (AP/VJ-16/WPP/2012-13)

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు స్థాపితం: 1930 జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

*Longest Living Newspaper in Telugu Journalism*

# జమీన్‌రైతు

సంపుటి: 83 • సంచిక: 31 • 2-8-2013 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-





# చిటికెలో వీడిన చిక్కు ముడి!

## సోనియమ్మ కాళ్ల దగ్గర సాగిలపడిన ఆంధ్రా పౌరుషం.

ఆంధ్ర ప్రదేశ్ రెండు ముక్కలైపోయింది. విడి విడి చెక్కలుగా మారింది. నవంబర్ నాటికి రెండు రాష్ట్రాలు, ఇద్దరు ముఖ్యమంత్రులు తథ్యం. జూలై 30తేది మంగళవారం నవమి గడియలలో ఈ నిర్ణయం తీసుకొన్నది కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ. కేంద్ర ప్రభుత్వం దాన్ని అమలు పరచడం లాంఛన ప్రాయం మాత్రమే. క్యాబినెట్ నోట్, హోంశాఖ నివేదిక, శాసనసభ తీర్మానం, పార్లమెంటు బిల్లు, రాష్ట్రపతి ఆమోదం, రాష్ట్ర విభజన నవంబర్ నెల లోపల చకచకా జరిగిపోవడం మనం చూస్తాము.

తెలంగాణ ఉద్యమం పతాక స్థాయిలో నడుస్తున్నప్పుడు కూడా రాష్ట్ర విభజన అంత సులువు కాదనే అభిప్రాయం అందరిదీ. నదీ జలాల పంపకం, విద్యుత్ కేటాయింపు, హైదరాబాద్ జగడం, నక్సల్ భయం, ఆంధ్రుల ప్రతిఘటన వంటి జఠిలమైన ప్రశ్నలెన్నో ముడిపడిన చిక్కు సమస్య ఇది. అందువల్ల ఎవరు నిర్ణయం తీసుకోవాలనుకొన్నా ఏళ్లుపూళ్లు పడుతుందని భావించారు. కానీ రెండు ఇళ్ల మధ్య గోడ కట్టినంత సులభంగా, రొట్టె ముక్కను చీల్చి చెరొకటి ఇచ్చినంత సునాయాసంగా రాష్ట్ర విభజన నిర్ణయం తీసుకొన్నారు సోనియాగాంధీ. అరవై ఏళ్ల రావణ కాష్టం మీద అరవై గంటలలో నీళ్లు చల్లడం ఒక్క కాంగ్రెస్‌కే చెల్లిన సామర్థ్యం. మరొకపార్టీ, మరొక నేత ఎవరూ ఇటువంటి నిర్ణయాలు చిటికె మాత్రంతో తీసుకోరు, తీసుకోలేరు.

రాష్ట్రాన్ని రెండుగా విభజిస్తామని, హైదరాబాదును తెలంగాణకు ఇస్తున్నామని, పది జిల్లాలకే కొత్త రాష్ట్రం పరిమితమని, ఆంధ్రులు పదేళ్ల లోపల హైదరాబాద్ వదలి పోవాలని, అంత వరకు దయ తలచి అక్కడే గుడారాలు వేసుకొని బస చేసే అవకాశం కల్పిస్తున్నామని, నీళ్ల కొరత తీర్చడానికి పోలవరాన్ని నిర్మిస్తామని దిగ్విజయ్ సింగ్, అజయ్ మాకెన్‌లు ప్రకటించారు. అంటే, ఒకే ఒక్క ప్రకటనతో తెలంగాణ రాష్ట్రం ఏర్పాటు ముగిసిపోయింది. ఆ ప్రకటన విని నోరు వెళ్లబెట్టని మనిషి లేడు. ముఖ్యమంత్రి నుంచి ముఠా కూలీ వరకు ఒకటే పరిస్థితి. సోనియాగాంధీ తెలంగాణ ఇవ్వడానికి సిద్ధపడ్డారని వారం నుంచి సంకేతాలు అందుతూ వున్నాయి కానీ ఆమె ఇంత విస్మయకరంగా అంత భారీ చిక్కు ముడిని చిటికెలో విడదీస్తున్నదని ఎవరూ కల కూడా కనలేదు.

### పాపం, పుణ్యం రెండూ సోనియమ్మవే!

ఆంధ్రుల దృష్టిలో సోనియాగాంధీ పెద్ద పాపం మూట కట్టుకొన్నది. తెలంగాణ దృష్టిలో ఆమె పుణ్యం

కొరవ 14వ పేజీలో

# సంయమనం కావాలి

ఎవరికి ఇష్టం వున్నా లేకపోయినా రాష్ట్ర విభజన జరిగిపోయింది. ఇక ఆపడం కష్టం. ఆంధ్ర ప్రాంతంలో బలమైన రాజకీయ నాయకత్వం లేనిలోటు కొట్టొచ్చినట్లు కన్పిస్తున్నది దీని ద్వారా. వైఎస్ బ్రతికి వుంటే ఇంత పని జరిగేది కాదనడం నిజం. కరీంనగర్ ఉప ఎన్నికలో కెసిఆర్ దిగ్విజయం తర్వాత, 2008లో ఒకసారి సోనియాగాంధీ ఇదే ప్రయత్నం చేస్తే, కోర్ కమిటీ ముందు గట్టిగా వాదించాడాయన. తనకొక అవకాశం ఇవ్వమని కోరాడు. దానికి తగినట్లే ఆ తర్వాత ఉప ఎన్నికలలో టిఆర్ఎస్‌ను ఓడించాడు. 2009 ఎన్నికలలో టిఆర్ఎస్ లేకుండానే తెలంగాణలో సీట్లు గెలిపించాడు. నాయకత్వ పటిమ అంటే అది. అంత మాత్రం అధిష్టానాన్ని నమ్మించగల్గే నేత ఇప్పుడు కాంగ్రెస్‌లో ఎవడూ లేడు. దాని ఫలితమే రాష్ట్ర విభజన.

దీన్ని సమ్మతించమని, అడ్డుకొంటామని ప్రగల్భాలు పలుకుతున్నారు మంత్రులు, నేతలు. అది వారి వల్ల అయ్యే పని కాదు. బయట మీసాలు తిప్పి పులులవలె ప్రవర్తించే వారు సోనియా పేరు వినపడగానే పిల్లుల మాదిరి మారి పోవడం గతానుభవం. అయితే తమ ఉనికి చాటుకోవడానికి ప్రజలలో నిరసన పేరిట ఆందోళనలు సృష్టించే ప్రయత్నం చేస్తున్నారు కొందరు. చాలా ప్రమాదకర పోకడ ఇది. ఈ అలజడి ఏదో ముందుగా చేసి వుంటే నిర్ణయం వాయిదా పడేది. ఇప్పుడు గోల చేయడం అంటే రెండు ప్రాంతాల మధ్య విద్వేషాలు పెంచడం అవుతుంది. అది ఎవరికీ క్షేమం కాదు. ఇప్పుడు కావలసింది సమైక్య వాదం కాదు, సంయమన విధానం. జిల్లాలలో బస్సులు తగలెడితే విభజన ఆగదు. పోలీస్ లాఠీలు పైకి లేస్తాయి. మిలటరీ తూటాలు పేలుతాయి. అమాయకులు ఆహుతైపోతారు. ఏ ఆందోళనలో అయినా ఏ ఒక్క నాయకుడికైనా తుపాకీ తూటా తగిలినట్లు విన్నామా? రెచ్చేగొట్టేది వారు, చావు కొని తెచ్చుకొనేది వీరు. చరిత్ర అంతా అంతే.

విభజన ఆపలేనప్పుడు, కనీసం ఆంధ్ర ప్రాంతం హక్కుల విషయంలోనైనా నిర్దుష్టమైన హామీలు పొందడానికి ప్రయత్నం చేయడం రాజకీయ నాయకత్వం చేపట్ట వలసిన కార్యక్రమం. నీళ్లు, విద్యుత్, నిధులు, సహజ వనరులు, ఆస్తులు వంటి వాటి పంపకంలో అన్యాయం జరగకుండా పటిష్టమైన ప్రణాళికతో వ్యవహరించాలి. మరొక ప్రక్క ఆంధ్రప్రదేశ్ రాష్టానికి లక్షా యాభై వేల కోట్ల రూపాయల అప్పులున్నాయి. వాటి పంపకంలో మనకు పెనాల్టీ పడకుండా చూసుకోవాలి. పదేళ్లపాటు హైదరాబాద్ ఉమ్మడి రాజధాని. అందువల్ల ఆ నగరంలో వచ్చే పన్నుల రాబడిలో న్యాయమైన వాటా పొందాలి. కొత్త రాజధాని కట్టుకోవడానికి లక్షల కోట్ల రూపాయల పెట్టుబడి అవసరం. తెలంగాణ నుంచి కొంత, కేంద్రం నుంచి కొంత సేకరించాలి.

కొత్త రాష్ట్రంలో సహజ వనరుల సద్వినియోగానికి, మరీ ముఖ్యంగా గోదావరి బేసిన్ సహజ వాయువు వాటా కోసం గట్టి ప్రయత్నం జరగాలి. మన రాష్ట్ర విద్యుత్ అవసరాలు తీర్చిన తర్వాతే రిలయన్స్ అయినా, ఓఎన్‌జిసి అయినా గ్యాస్‌ను సరిహద్దు దాటించేట్లు ఉద్యమం నడపాలి. ఆ లక్ష్యం సాధించగల్గితే విభజన వల్ల కలిగే నష్టాలన్నీ పదేళ్లలో పూడిపోతాయి.

జమీన్‌రైతు

హైదరాబాద్‌లో ఆంధ్రుల భద్రతకు గట్టి హామీ ఇస్తున్నది కేంద్రం. అది అమలయ్యేట్లు చూడడంతో పాటు, అక్కడ మన వారికి విద్య, ఉద్యోగ అవకాశాలకు విఘాతం కల్గించకుండా జాగ్రత్త పడాలి. హైదరాబాద్ పరిశ్రమలలో తెలంగాణ వారినే నియమించాలనే ఒత్తిడి అప్పుడే వస్తున్నట్లు వార్తలు విన్పిస్తున్నాయి. అటువంటి పోకడలను ప్రతిఘటించాలి.

ఆంధ్రుల ప్రయోజనాలను పరిరక్షించడం రాజకీయ నాయకత్వం నిజమైన అభిలాష. అయితే ఇప్పుడు కావలసింది సంచలనాలు కాదు. సంయమనం. ఎంత నేర్పుతో, ఓర్పుతో విభజన చర్చలలో పాలుపంచుకొంటే అంతగా మన ప్రయోజనాలు కాపాడబడతాయి. అన్ని పార్టీల నేతలూ విబేధాలు పక్కన పెట్టి ఆంధ్రుల మేలు కోసం ఏకతాటి మీద నిలబడాలని కోరుకొంటున్నాము.

## జనవాణి

### శ్రీనివాస రామానుజన్ నెల్లూరులో పని చేయలేదు!

ప్రఖ్యాత గణిత శాస్త్రజ్ఞుడు శ్రీనివాస రామానుజన్ జీవితం ఆధారంగా తీస్తున్న చిత్రం షూటింగ్ కలెక్టరేట్‌లో జరిగినట్లు 'జమీన్‌రైతు'లో చదివి చాలా సంతోషమయ్యింది. విషయమేమిటంటే శ్రీనివాస రామానుజన్ నెల్లూరు కలెక్టరేట్‌లో పని చేయలేదు. అప్పటి కలెక్టర్ ఆర్.రామచంద్రరావు గారు వారి గణిత శాస్త్ర అధ్యయనానికి తోడ్పడి మద్రాసు పోర్టు ట్రస్ట్‌లో గుమస్తా నియామకానికి సిఫార్సు చేశారు. ఈ విషయమై 15.1.1988 'జమీన్‌రైతు' సంచికలో నా వ్యాసం ప్రచురితమయ్యింది. ఇది ప్రచురితమయ్యాక ఇందుకూరుపేట నుంచి ఒక రెడ్డిగారు నా వ్యాసంపై స్పందిస్తూ ఈ విషయమై స్వర్గీయ నెల్లూరు వెంకట్రామానాయుడు గారు అప్పటి కలెక్టర్ ఆర్.రామచంద్రరావు గారు సంభాషించుకొన్న సమయంలో తానున్నట్లు వ్రాశారు. నెల్లూరు కలెక్టరేట్‌లో శ్రీనివాస రామానుజన్ విగ్రహాన్ని ప్రతిష్టించడం సముచితమని ఆనాడు కోరాను. ఈనాడూ కోరుతున్నాను.

రామావఝుల శ్రీశైలం — హైదరాబాద్

### వైద్యం - విద్య ఉచితంగా అందించండి!

భారతదేశంలో ప్రజలకు స్వేచ్ఛా స్వాతంత్రాలు కల్పించడం మినహా అతి ముఖ్యమైన వైద్యం, విద్యను ప్రభుత్వాలు ఉచితంగా అందించడం లేదు. దేశంలో ఎక్కడ చూసినా ప్రభుత్వ స్కూళ్లు, ప్రభుత్వాస్పత్రులు దుస్థితిలో వున్నాయి. దీనివల్ల ఒకటవ తరగతి నుంచే విద్యను డబ్బు పెట్టి కొనాల్సి వస్తోంది. మెరుగైన వైద్యం కోసం ఎన్నో కుటుంబాలు ఆస్తులను అమ్ముకొని బికారులుగా మిగిలిన పరిస్థితులు నేడున్నాయి. మన రాష్ట్రంలో మినహా 'ఆరోగ్యశ్రీ' పథకం దేశంలో ఎక్కడా లేదు. దేశ ప్రజలందరికీ ఇంజనీరింగ్, వైద్య విద్యతో సహా అన్నీ ఉచితంగా అందించాలి. వైద్యాన్ని కూడా అన్ని తరగతుల వారికి అందుబాటులో వుంచాలి.

వాస్తు రామచంద్రరావు — నెల్లూరు

### నెల్లూరులో నాసిరకంగా రోడ్లు!

నెల్లూరు నగరంలో ప్రజాధనాన్ని పాలకులు విచ్చలవిడిగా దోచేస్తున్నారు. దీనికి నగరంలో ప్రస్తుతం జరుగుతున్న రోడ్ల పనులే చక్కని ఉదాహరణ. జిల్లా పోలీసు ఆఫీసు వద్ద తారురోడ్డు బాగుండింది. దీనిపై అవకతవకల సిమెంటు రోడ్డు వేశారు. మాగుంట సుబ్బరామిరెడ్డి విగ్రహం నుంచి నెహ్రూ బొమ్మ వరకు ట్రంకురోడ్డును సిమెంటు రోడ్డుగా చేస్తున్న పనులు నాసిరకంగా వున్నాయి. మినీబైపాసు రోడ్డు విస్తరణ గూర్చి ఎంత తక్కువగా చెప్పుకొంటే అంత మంచిది. కోట్లాది రూపాయల ప్రజాధనాన్ని అంతేవాసుల అభివృద్ధికి అధికార పార్టీ నేతలు వినియోగించడం బాధాకరం.

పి.అరుణకుమారి — నెల్లూరు

## 70 ఏళ్ల క్రితం ఈవారం

6-8-1943
పేజీలు : 4 వెల : అణా

### అవీ - యివీ

### తపాలా పెట్టి విలాపం

నేను టౌన్‌హాలుకు ఎదుట రోడ్డులో బిడ్డలు గడ్డలులేని తల చెడ్డ బ్రాహ్మణ ఆడ వితంతువు మాదిరి మోటుగా నిలబడి యున్నాను. నన్ను గత ఆగష్టులో అల్లరి పిల్లలు తల, కడుపు పగులగొట్టారు. నావలెనే దెబ్బలు తిన్న యితర వస్తు భూతాలన్నీ బాగుపడ్డవి. నా కర్మమేమిటో నా దిక్కు మొక్కు చూచిన ప్రాణిలేదు. ఈనాటికీ నేను ముత్తైదువుగా వున్నానని కొందరు కళ్లున్న గ్రుడ్డివాళ్లు నా కడుపులో ఉత్తరాలు వేసి పోతుంటారు. వాటిని నాకు దోడుబోయిన తపాలా బంట్రోతులు - అంటే అల్లరి పిల్లకాయలు అప్పటికప్పుడే సెన్సారుచేసి డెడ్ లెటరు ఆఫీసనే ప్రక్క మురుక్కాలవలో పారవేస్తుంటారు. ఆ ఉత్తరాలు వ్రాసుకొనే పెద్ద మనుష్యులు వాటికింకా జవాబురాలేదని తపాలా బంట్రోతుల చుట్టు బాకీలు దండే కోమట్ల మాదిరి చుట్టక పట్టక తిరుగుతుంటారు. ఇలా వుంది నా గతి. మాటి మాటికీ కొంటె పిల్లకాయల చేత నన్ను రాళ్లతో కొట్టించే దానికంటే నన్ను ఇక్కడ నుండి తొలగించడమో? లేక యింత పసుపు కుంకుమను పెట్టి నలుగుర్లో తిరుగా తలెత్తుకొని తిరిగేట్లు చేయడమో చేస్తే బాగుంటుందని మా డిపార్ట్‌మెంటు వారికి భోరున ఏడుస్తూ మనవి చేస్తున్నాను.

— ఆ తపాలా పెట్టె

### లేబూరు ప్రెసిడెంటుకు చావుదెబ్బ

విన్నారా మావూరు రైతు సంఘాధ్యక్షుడు దేవిరెడ్డి రమణారెడ్డి గారిని ఎవరో హంతకులు 20తేది రాత్రి పడక మీద పొడిచారు. ఆసుపత్రిలో చికిత్సింపబడుతున్నాడు. ప్రాణం గండం తప్పినట్లే. ఈ వ్యక్తికి విరోదులు లేరే ఎట్లా జరిగిందబ్బా!

## 50 ఏళ్ల క్రితం ఈవారం

2-8-1963
పేజీలు: 12 వెల: 0-20 న.పై

### నేలమట్టమైన యుగోస్లోవ్ నగరం

యుగోస్లోవియాలో షుమారు 2,50,000 జనాభాగల స్కోప్‌జీ అను అధునాతన నగరంలో మూడవ భాగం భూకంపం వల్ల నేలమట్టమైంది. దాదాపు 15వేల మంది ప్రజలు సజీవంగా సమాధియైనారు. ఇంతటి భయంకర విపత్తు యుగోస్లోవియా చరిత్రలోనే గాదు, ప్రపంచ చరిత్రలోనే ఇటీవల లేదు. ప్రెసిడెంటు టిటో ప్రభుత్వం ప్రకృతి నిర్దయకు గురియైన స్కోప్‌జీ నగరంలో కేంద్రీకృతమై రక్షణ చర్యలు గావిస్తున్నది. ప్రపంచ ప్రజలందరూ అభాగ్యులైన ఆ పౌరుల పట్ల సానుభూతి చూపుతున్నారు.

### తుపాకి గురిలో పులి మన ప్రధాని!

ప్రధాని జవహర్లాల్ నెహ్రూ గత వారంలో హైదరాబాదులో వున్నప్పుడు తుపాకి గురి పెట్టడంలో 'పులి' అని రుజువు జేసుకొన్నారు. 60 అడుగుల దూరాన ఒక కొయ్య పులిని వుంచారు. ప్రధాని దానిని మొదటి ప్రేటుకే కూల్చాడు. అంతా అయిన తర్వాత నెహ్రూ అన్నారు - "ఇదంతా నా ప్రావీణ్యత అనుకునేరు. అదేదో గ్రుడ్డివాటంగా తగిలింది".

### సహకార నూలు మిల్లు

50 లక్షల పెట్టుబడితో 12వేల కదుళ్ళతో సహకార రంగంలో నెల్లూరు నెలకొల్పదలచిన నూనె మిల్లు డైరెక్టర్ల సమావేశం 25తేది సెంట్రల్ బ్యాంక్ హాల్‌లో జరిగింది. చీరాల నూనె మిల్లు అధ్యక్షుడు ప్రగడ కోటయ్య, రాష్ట్ర చేనేత కాంగ్రెస్ అధ్యక్షుడు శ్రీ కోటి వీరయ్య గారు కూడా సమావేశానికి హాజరయ్యారు. ఈ సమావేశంలో బైలాల తుది ఆమోదం జరిగింది.

# నెల్లూరు ముచ్చట్లు

## నెల్లూరులో నిరసన తక్కువ!

తెలంగాణకు యుపిఏ సర్కార్ పచ్చ జెండా ఊపిన తరుణంలో సీమాంధ్ర ప్రాంతమంతా భగ్గుమంటున్నా నెల్లూరులో మాత్రం చెప్పుకోతగ్గ నిరసనలు లేవు. సామాన్య జనం వీధుల్లోకి వచ్చి ప్రదర్శనలు చేయలేదు. 31వ తేది నగరంలో ఆర్టీసి బస్సులు, ఆటోలు యధావిధిగా తిరిగాయి. వ్యాపార సంస్థలు, బ్యాంకులు పనిచేశాయి. విద్యాసంస్థలు మాత్రం మూతపడ్డాయి. ఉద్యమాల ఖిల్లా నెల్లూరు జిల్లాలో ఈ ధోరణి ఏమిటో అర్థం కావడం లేదు. హైదరాబాద్‌లో పెద్ద సంఖ్యలో నెల్లూరీయులు స్థిరపడి ఉన్న విషయం అందరికీ విదితమే.

## పారామిలటరీ దళాల కవాతు!

నెల్లూరులో 29వ తేది సాయంత్రం సిఆర్‌పిఎఫ్, ఎపిఎస్పీ దళాలు చేసిన కవాతు చర్చనీయాంశమయ్యింది. చెన్నై నుంచి వచ్చిన సిఆర్‌పిఎఫ్ దళం కస్తూరిబా కళాక్షేత్రంలో బసచేసి సాయంత్రం సాయుధులై కెవిఆర్ పెట్రోల్ బంకు నుంచి ఎసి సెంటర్ వరకు కవాతు చేసి తిరిగి కస్తూరిబా కళాక్షేత్రం చేరారు. ప్రత్యేక రాష్ట్ర ప్రకటన తర్వాత 30వ తేది రాత్రి నగరంలోని ముఖ్య కూడళ్లలో సిఆర్‌పిఎఫ్ దళం పహారా కాసింది.

## ఎసిబి వలలో ఎసిటిఓ!

మహా లంచగొండులుగా పేరు గాంచిన వాణిజ్య పన్నుల శాఖ అధికారులు ఆలస్యంగా ఎసిబి వలలో పడ్డారు. నెల్లూరులోని లక్ష్మీ వెంకటేశ్వర మెడికల్ ఏజెన్సీ యజమాని దుర్గాప్రసాద్‌కు చెందిన దుకాణాల లైసెన్సు రద్దు కాకుండా ఉండను పదివేల రూపాయల లంచం తీసుకొంటుండిన వాణిజ్య పన్నుల శాఖ సర్కిల్–2 ఎసిటిఓ ఎ.శేషగిరి రావును ఎసిబి అధికారులు రెడ్‌హ్యాండెడ్‌గా పట్టుకొన్నారు. ఈయన్ను ఎసిబి ప్రత్యేక న్యాయస్థానంలో హాజరుపర్చగా న్యాయమూర్తి ఆగష్టు 12వ తేదీ వరకు రిమాండ్ విధిస్తూ తీర్పు చెప్పారు.

## తమిళనాడు ఎక్స్‌ప్రెస్ దగ్ధ దుర్ఘటనకు ఏడాది!

నెల్లూరు విజయమహల్ గేటుకు సమీపంలో చెన్నై వెళ్తుండిన తమిళనాడు ఎక్స్‌ప్రెస్‌లో పేలుడు పదార్థం మండి ఓ కోచ్ దగ్ధమైన సంఘటన జరిగి జులై 30వ తేదికి ఏడాది పూర్తయ్యింది. ఈ ఘటనలో 30 మంది చనిపోయారు. కానీ 29 మంది శవాలను మాత్రమే గుర్తించారు. 25 మంది గాయపడ్డారు. ప్రాణాలు పోగొట్టుకొన్న వారికి మాత్రం ఐదు లక్షల రూపాయలు రైల్వేశాఖ పరిహారంగా అందించింది. కానీ ఈ దుర్ఘటన బాధ్యులను ఇంతవరకు గుర్తించని విధంగా వక్ర దర్యాప్తును పూర్తిచేసి గబ్బు పట్టింది రైల్వేశాఖ.

## 14 గంటల రోజా!

రంజాన్ పండుగ మాసమంతే రోజంతా రోజా(ఒక్క పొద్దు)తో ముస్లిం సోదరులుంటున్నారు. అన్నిరకాల పనులు చేసుకొంటూ 14 గంటల 30 నిమిషాల పాటు నోట్లో ఉమ్మి కూడా మింగకుండా అల్లా నామస్మరణతో ఉండడం విశేషంగానే చెప్పుకోవాలి. వేకువజామున 4.26 నిమిషాలకు సహరీతో ప్రారంభమయ్యే రోజా సాయంత్రం 6.41 నిమిషాలకు ఇఫ్తార్‌తో ముగుస్తుంది. ఈ మధ్యకాలంలో నాలుగు పూటల నమాజు, ఇఫ్తార్ అయ్యాక మరోసారి రాత్రి 8.30 నిమిషాలకు రోజా ఉండే వ్యక్తి తరావీ నమాజు గంటా పదిహేను నిమిషాలు విధిగా చదవాలి. ప్రక్క మనిషి ఆకలి బాధ తెలియను అల్లా విధించిన రోజా నియమం పరమాద్భుతం. ఇఫ్తార్ సమయంలో నగరంలోని మసీదులు వందల సంఖ్యలో యువకులతో నిండి పోతున్నాయి. యువతలో ఆధ్యాత్మికత సమాజానికి మంచి చేస్తుంది. రంజాన్ రోజాలు మంచికి, మానవత్వానికి ఊపిరి పోస్తాయన్నది నూటికి నూరు పాళ్లు నిజమని చెప్పక తప్పదు.

## కార్మికాధికారికి ప్రమోషన్!

నెల్లూరు కార్మిక శాఖ ఉప కమిషనర్‌గా పనిచేస్తుండిన రఘురామయ్యకు పదోన్నతినిస్తూ ఏలూరుకు బదలీ చేశారు. చిత్తూరు కార్మిక శాఖ కమిషనర్ ఎస్.వై.శ్రీనివాసన్‌కు నెల్లూరు అదనపు బాధ్యతలు అప్పజెప్పారు. కార్మిక శాఖలో పనిచేసిన అధికారులందరిలోనూ భిన్నమైన వ్యక్తిగా రఘురామయ్య గుర్తింపు పొందారు. నెల్లూరులో అదనపు బాధ్యతలు స్వీకరించిన వ్యక్తి అప్పుడే దడ బదలు మొదలుపెట్టారు.

## ఆదాల, ముంగమూరు రాజీనామాలు!

రాష్ట్ర విభజనను వ్యతిరేకిస్తూ సర్వేపల్లి ఎమ్మెల్యే ఆదాల ప్రభాకర్‌రెడ్డి, నెల్లూరు సిటీ ఎమ్మెల్యే ముంగమూరు శ్రీధర్‌కృష్ణారెడ్డిలు రాజీనామా చేశారు. వీరు తమ రాజీనామాలను స్పీకర్ నాదెండ్ల మనోహర్‌కు పంపారు. సమైక్యాంధ్రను విడదీస్తే తమ రాజీనామాలు అంగీకరించమని ఈ ఇద్దరు శాసన సభ్యులు కోరారు.

## సుబేదారుపేటలో రోడ్డుపై గుంటలు!

నగరంలోని సుబేదారుపేటలో నాలుగు కాళ్ల మండపం సెంటర్ నుంచి ఆర్‌కెటి పెట్రోల్ బంకు వరకు రోడ్డుపై మ్యాన్‌హోల్ గుంటలు 40 సెంటీమీటర్ల మందాన వదలివేశారు. చీకటి, వర్షంలో ఈ గుంటలు కానరాక ద్విచక్ర వాహన చోదకులు వీటిలో పడిపోతున్నారు. ఈ చిన్న రోడ్డుపై పదిహేను చోట్ల ఈ గుంటలున్నాయి. వీటిని ఇలా వదలేయడమేమిటో అర్థం కావడం లేదు.



## రాష్ట్ర విభజనను ఒప్పుకోం!

కేవలం ఓట్లు సీట్ల కోసమే రాష్ట్రాన్ని విభజించాలని కాంగ్రెస్ పార్టీ ప్రయత్నిస్తుందని తెలుగుదేశం పార్టీ పొలిట్‌బ్యూరో సభ్యుడు సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి విమర్శించారు. 27వ తేది నెల్లూరులోని తెలుగుదేశం పార్టీ కార్యాలయంలో విలేకరులతో మాట్లాడారు. రాష్ట్ర ప్రయోజనాలను పట్టించుకోకుండా రాష్ట్రాన్ని విభజిస్తే ఏ మాత్రం సహించమన్నారు. తెలుగుగంగ, హంద్రీనీవా, గాలేరు – నగరి, వెలిగొండ ప్రాజెక్టులు కృష్ణా జలాలపైనే ఆధారపడి ఉన్న విషయాన్ని గుర్తుచేశారు. విభజన మూలంగా కడప, నెల్లూరు, చిత్తూరు, ప్రకాశం జిల్లాల ప్రజలు తాగునీటి కోసం కూడా ఇబ్బంది పడాల్సి వస్తుందని చంద్రమోహన్‌రెడ్డి స్పష్టం చేశారు.

## కర్నాటికి చిత్తూరు బిజెపి బాధ్యతలు!

జిల్లాలో సీనియర్ బిజెపి నేత కర్నాటి ఆంజనేయరెడ్డి చిత్తూరు జిల్లా ఇన్‌ఛార్జ్‌గా బిజెపి రాష్ట్ర అధ్యక్షుడు కిషన్ రెడ్డి నియమించారు. 1986 బిజెపిలో బిజెవైఎం నేతగా ప్రవేశించిన కర్నాటి 1987లో జిల్లా కార్యదర్శిగా ఎదిగారు. 1989లో ఆత్మకూరు ఎమ్మెల్యే అయ్యే అవకాశం వెంట్రుకవాసిలో దూరమయ్యింది. ఆ తర్వాత బిజెపి కిసాన్ మోర్చాలోనూ పార్టీ జిల్లా అధ్యక్షునిగా కూడా పని చేశారు. ప్రస్తుతం ఆయన పార్టీ రాష్ట్ర అధికార ప్రతినిధిగా పనిచేస్తున్నారు.

## శాంతాసిన్హాకు గోపాలరెడ్డి అవార్డు!

నెల్లూరు ఆడపడుచు, యూనివర్శిటీ ఆఫ్ హైదరాబాద్‌లో ప్రొఫెసర్, చిన్న వయస్సులోనే పద్మశ్రీ, రామోన్ మెగసెసే అవార్డులు అందుకున్న అతివ శాంతాసిన్హాను ఈయేడు ఉత్తరప్రదేశ్ మాజీ గవర్నర్ డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి స్మారకంగా ఇచ్చే అవార్డుకు ఎంపిక చేశారు. 4వ తేది ఉదయం 10 గంటలకు టౌన్‌హాలులో ఈ అవార్డు ప్రదానం చేస్తారు. ఈ సందర్భంగా జరిగే సభకు మాజీ స్పీకర్ అగరాల ఈశ్వరరెడ్డి అధ్యక్షత వహిస్తారు. ఆనం వివేకానందరెడ్డి, ముంగమూరు శ్రీధర్‌కృష్ణారెడ్డి, మాగుంట పార్వతమ్మ, వేమిరెడ్డి ప్రభాకర్‌రెడ్డి తదితర ప్రముఖులు పాల్గొంటారు. గోపాలరెడ్డి అభిమానులందరినీ ఈ సభకు తరలి రమ్మంటున్నారు అవార్డు కమిటీ అధ్యక్ష, కార్యదర్శులు జెవిరెడ్డి, బివి నరసింహం.

## గోమతి స్కూల్‌లో కార్గిల్ విక్టరీ డే!

నెల్లూరు మినీ బైపాస్‌రోడ్డులోని గోమతి ఇంగ్లీషు మీడియం స్కూల్‌లో 26వ తేది కార్గిల్ విక్టరీ డేను నిర్వహించారు. అమరవీరుల చిత్రపటాల ముందు స్కూల్ విద్యార్థులు సైనిక వస్త్రధారణతో చేసిన మార్చ్‌ఫాస్ట్ అందరినీ అలరించింది. ఈ సందర్భంగా దేశభక్తిపై పాఠశాల డైరక్టర్ పి.అరుణా రాజశేఖర్ చేసిన ఉపన్యాసం ఆకట్టుకొంది.



## ఖుద్దూస్ ట్రస్ట్!

నెల్లూరు కూరగాయల మార్కెట్ కమిటీ మాజీ అధ్యక్షుడు, మాజీ కౌన్సిలర్ దివంగత షేక్ ఖుద్దూస్ సాహెబ్ పేరిట ఆయన కుమారులు ట్రస్టును ఏర్పాటు చేశారు. ముస్లిం మైనార్టీల్లో పేద యువతుల పెళ్లిళ్లు, వితంతులకు పెన్షన్లు ఇచ్చే సంకల్పంతో ఈ ట్రస్ట్ పని చేస్తుంది. దైకస్‌రోడ్డులోని మాంసం మార్కెట్ సెంటర్‌లో ఈ ట్రస్ట్ కార్యాలయం నిర్వహిస్తున్నారు. ట్రస్ట్ సాయం కోరేవాళ్లు, సాయంచేసే వాళ్లు ఈ చిరునామాలో సంప్రదించవచ్చంటున్నారు ట్రస్ట్ ఛైర్మన్ షేక్ మొహియుద్దీన్, వైస్ ఛైర్మన్ షేక్ మున్వర్.

## డాక్టర్ వెంకట రమణారెడ్డి మరణం

నెల్లూరు నగరంలో ఇఎన్‌టి వైద్యునిగా జనం మన్ననలు పొందిన ఎ.వెంకట రమణారెడ్డి (52) 1వ తేది మరణించారు. గత కొంతకాలంగా క్యాన్సర్ వ్యాధితో బాధపడుతుండినారాయన. రోగుల పరిస్థితిని బట్టి ఉదారంగా తన వద్దకు వచ్చే పేషెంట్లకు సహాయపడేవాడు. ఆయనకు భార్య, కుమారుడు, కుమార్తె వున్నారు.

## మెజీషియన్ రాంజీకి మాతృ వియోగం

బుచ్చి మండలం కట్టుబడిపాళెం వాసి మెజీషియన్‌గా అందరికీ సుపరిచితుడు రాంజీ తల్లి గుంజి లక్ష్మమ్మ(80) 27వ తేది మరణించారు. ఆమె కొంత కాలంగా అనారోగ్యంతో బాధపడుతుండినారు. రాంజీగాక ఆమెకు ఇద్దరు కుమార్తెలున్నారు.

ఆత్మీయులను కోల్పోయిన పై కుటుంబాల వారికి మా సానుభూతి.

# మసీదులు కళకళ!

- నెల్లూరులో భక్తిశ్రద్ధలతో రంజాన్ రోజాలు



ఇఫ్తార్ విందులో ముస్లిం సోదరులు.

రంజాన్ మాసాన్ని పురస్కరించుకొని నెల్లూరు నగరంలోని చిన్నా, పెద్ద మసీదులు నమాజ్‌కు వచ్చే వారు, వెళ్లేవారు, ఒక్కపొద్దులుండే వారితో కళకళలాడుతున్నాయి. నగరంలో లక్ష మందికి పైగా ముస్లిం జనాభా అన్ని ప్రాంతాల్లో విస్తరించి వున్నారు. జెండావీధి, కోటమిట్ట, మన్సూర్‌నగర్, ఖుద్దూస్‌నగర్, రంగనాయకులపేట, వెంకటేశ్వరపురం ప్రాంతాల్లో పెద్దసంఖ్యలో ముస్లింలున్నారు. కొత్తగా టెక్కేమిట్ట, జాకీర్‌హుస్సేన్‌నగర్, అంబేద్కర్ నగర్, పొదలకూరు రోడ్డు, గాంధీనగర్, ట్రైలర్స్ కాలనీల్లో కొత్తగా ముస్లింలు వందల సంఖ్యలో నివశిస్తున్నారు. నెల్లూరు నగరంలో 80కి పైగా మసీదులున్నాయి. వీటిలో 10 మసీదులకు మాత్రమే స్థిరాస్తులున్నాయి. మిగతా 70 మసీదులు ముస్లిం సోదరులు నెల నెలా ఇచ్చే చందాలు, కొందరు చేసే గుప్తదానాలతో నడుస్తున్నాయి. మసీదుల్లో ఐదు పూటలా నమాజులు చదవను పేష్‌మామ్, మౌజన్లు ఉంటారు. వీరి జీతాలు, కరెంట్, నిర్వహణ మిగతావి ఇబ్బందులు లేకుండా నడుస్తున్నాయి. రంజాన్ మాసం కావడంతో నమాజు వేళలకు మసీదులు కిటకిటలాడుతున్నాయి. సాయంత్రం పూట ఇఫ్తార్ సమయంలో ప్రతి మసీదులో సాంప్రదాయపరమైన ఆష్ వంటకంతోపాటు కొన్ని చోట్ల బిర్యానీ, శక్తినిచ్చే ఖర్జూరాలు, చిరుతిండ్లు శక్తిమేర ఒక్కపొద్దులుండే వారికి మత ప్రమేయం లేకుండా దాతృత్వపరులు అందిస్తున్నారు. రంజాన్ మాసంలో రోజా ఉండే ముస్లింలకు ఏదో విధంగా సహాయపడే వారికి అల్లా ఆశీస్సులుంటాయనే నమ్మకంతో పలువురు మసీదులను అన్ని రకాలుగా పోషిస్తున్నారు. రాష్ట్రంలో ఏ నగరంలో లేనట్లు పదికి పైగా మసీదులు ఎసి సౌకర్యంతో అలరారుతున్నాయి. రాత్రి 10 గంటల వరకు సాగే తరావీ నమాజుతోపాటు ఖురాన్ వ్యాఖ్యానంతో మసీదులు మూతపడి మళ్లీ తెల్లారి 4 గంటలకే తెరుచుకొంటున్నాయి. ముస్లింలు నివసించే ప్రాంతాల్లో రంజాన్ సందర్భంగా వెదజల్లుతున్న ఆధ్యాత్మిక సౌరభం ఏడాదంతా కొనసాగితే బాగుంటుందని ముస్లిం మత పెద్దల ఆశ. ఇది సఫలం కావాలని కోరుకొందాం.

# గ్యాస్ ఏజెన్సీల రుబాబు

## ఆధార్ కార్డుతోపాటు బ్యాంక్ అకౌంట్ అనుసంధానం చేయను పలు ఆంక్షలు




పెద్దాసుపత్రి వద్ద వున్న గ్యాస్ ఏజెన్సీ వద్ద వివరాలు నమోదు చేసుకొంటున్న వినియోగదారులు.

నెల్లూరు నగరంలోని గ్యాస్ ఏజెన్సీల నిర్వాహకులు గ్యాస్ సిలిండర్లకు ఆధార్ కార్డుతోపాటు బ్యాంక్ అకౌంట్ నెంబర్‌ను అనుసంధానం చేసే ప్రక్రియ పేర వినియోగదారులను ముప్పతిప్పలు పెడుతున్నాయి. నగరంలో హెచ్‌పి, ఐఓసి, బిపిసి కంపెనీల గ్యాస్ సిలిండర్లు పంపిణీ చేసేందుకు కృష్ణ, కల్పన, పద్మశ్రీ, విజయ, రెడ్డి అండ్ రెడ్డి, డికె, శుభ, ఏపిసిఎస్‌సి(ఐఒసి), ఏపిసిఎస్‌సి (బిపిసి), భార్గవి ఏజెన్సీలున్నాయి. ఆధార్‌కార్డు, బ్యాంక్ అకౌంట్ నెంబరు ఇవ్వకుంటే 1100 రూపాయలకు సిలిండర్లు కొనాల్సి వస్తుందని ఊదరగొట్టడం, దీనికి గడువు జూలై 31వ తేదిగా ప్రకటించడంతో ప్రతి గ్యాస్ వినియోగదారుడు బెంబేలెత్తిపోయి అడిగిన జెరాక్స్ ప్రతులతో సహా ఏజెన్సీల వద్దకు పరుగెడుతున్నారు. అదేమిటో గానీ ఒక్కో ఏజెన్సీ నిర్వాహకుడు ఒక్కో పత్రాలు అడుగుతున్నాడు. కొందరు పత్రాల స్కానింగ్ ఖర్చు కూడా వినియోగదారుల నెత్తినే దోస్తున్నారు. ఎంతో ప్రయాసపడి, క్యూలో నిలబడి ఈ పత్రాలన్నీ ఇస్తున్నా ఒక్క ఏజెన్సీ నిర్వాహకుడూ ఇది అందినట్లు రసీదు సైతం ఇవ్వడం లేదు. ఇస్తున్న పత్రాలు విసిరిపారేస్తున్న ఏజెన్సీల నిర్వాహకులూ వున్నారు. జాయింట్ కలెక్టర్ లక్ష్మీకాంతం పంచాయతీ ఎన్నికల హడావుడి ముగిశాక రోజుకో గ్యాస్ ఏజెన్సీ తనిఖీకి వెళ్తేగానీ నెల్లూరులోని గ్యాస్ ఏజెన్సీల నిర్వాహకులు దారికి రారు. జవాబుదారీతనం ప్రదర్శించరు.

- నారాయణ మెడికల్ కాలేజిలో

# అంతర్జాతీయ నర్సింగ్ సదస్సు!




సదస్సులో మాట్లాడుతున్న జోస్ఫిస్ లిటిల్ ఫ్లవర్.

చింతారెడ్డిపాళెంలోని నారాయణ మెడికల్ కాలేజి ప్రాంగణంలోని నర్సింగ్ కళాశాలలో అంతర్జాతీయ నర్సింగ్ సదస్సు 26, 27 తేదీల్లో ఘనంగా జరిగింది. కేంద్ర ప్రభుత్వ నర్సింగ్ విద్య అడ్వైజర్ జోస్ఫిస్ లిటిల్ ఫ్లవర్ మాట్లాడుతూ నర్సింగ్ విద్యార్థులు ఈ విద్యపై పరిజ్ఞానాన్ని పెంపొందించుకోవాల్సిన అవసరం ఉందన్నారు. నర్సింగ్ విద్యకు అన్ని ప్రాంతాల్లో తగిన గుర్తింపు ఉందన్నారు. ఈ విద్య అభ్యసించే వారికి సేవాగుణం తప్పనిసరిగా ఉండాలన్నారు. నర్సింగ్ విద్యార్థినులు మారుతున్న కాలంతోపాటు పరిజ్ఞానాన్ని అలవర్చుకోవాలన్నారు. బెంగుళూరులోని నిమ్‌హన్స్ నర్సింగ్ కళాశాలకు చెందిన లలితా కృష్ణస్వామి మాట్లాడుతూ ఇటువంటి సదస్సులు ఏర్పాటు చేయడం నర్సింగ్ విద్యార్థినులకు ఎంతో ఉపయుక్తంగా ఉంటుందన్నారు. బెంగుళూరు నర్సింగ్ కళాశాల డీన్ ఇందిర, నారాయణ నర్సింగ్ కళాశాల ప్రిన్సిపాల్ రాజేశ్వరి, డాక్టర్ సుబ్బారావు, నారాయణ ఆసుపత్రి మెడికల్ సూపరింటెండెంట్ నరసింహారెడ్డి, అడిషినల్ సూపరింటెండెంట్ రామ్మోహన్, పలువురు నర్సింగ్ అధ్యాపకులు, విద్యార్థులు ఈ సదస్సులో పాల్గొన్నారు.

# విఠపు × మువ్వా

## ఈ వివాదం ముగిసేదెన్నడు?





జిల్లా విద్యాశాఖాధికారి మువ్వా రామలింగంపై శాసన మండలి సభ్యులు, ఉపాధ్యాయ సంఘాలు చేస్తున్న అవినీతి ఆరోపణల వివాదం కులం రంగు పులుముకొంది. ఒక రకంగా చెప్పాలంటే కులం రంగు పులుముకొంది అనడం కంటే పులిమారు అనడం బాగుంటుంది. శరపరంపరగా తనపై వస్తున్న అవినీతి ఆరోపణలు, ముఖ్యమంత్రి స్థాయి వరకు ఈ విషయాన్ని తీసుకెళ్లిన శాసన మండలి సభ్యుడు విఠపు బాలసుబ్రహ్మణ్యంను ఎదుర్కొనేందుకు టక్కుటమార విద్యల్లో ఆరితేరిన రామలింగం కుల సంఘాలను ఉసిగొల్పాడు. కొందరు తన సామాజిక వర్గం వారిని చేరదీసి విఠపుపై ఆరోపణలు చేయించాడు. దీనికి ప్రతిగా పలు ఉద్యోగ, ఉపాధ్యాయ, కార్మిక సంఘాలు డిఇఓ రామలింగం వ్యవహారశైలిని, ఆయనకు తందానతాన అంటున్న కుల సంఘాల విమర్శలపై ప్రతి విమర్శలకు దిగడంతోపాటు వారి ఆరోపణలను తీవ్రంగా ఖండించారు. ఎన్జీఓ అసోసియేషన్, జనవిజ్ఞాన వేదిక, యుటిఎఫ్, ఎల్‌ఐసి, కాంట్రాక్ట్ లెక్చరర్స్ అసోసియేషన్‌లు ప్రధానంగా విఠపు బాలసుబ్రహ్మణ్యంపై డిఇఓ మద్దతుదారులు చేస్తున్న ఆరోపణ అక్షరాస్యత కార్యక్రమంలో పుస్తకాలు అచ్చు వేసేందుకు కాంట్రాక్ట్ పొంది లక్షల రూపాయలు స్వాహా చేశాడన్నది. ఇది ఎంతవరకు వాస్తవం, ఆరోపణలు చేసిన వారి సచ్ఛీలత ఏంటనే దానిపై జిల్లాలో తీవ్ర చర్చ జరుగుతోంది. ప్రభుత్వ శాసన మండలి సభ్యులుగా ప్రస్తుత సభ్యుడు విఠపు బాలసుబ్రహ్మణ్యానికి, మాజీ సభ్యుడు రామిరెడ్డికి ఎంతో పేరుంది. అలాంటి వారిపై పలుమార్లు ఏసిబికి దొరికి, పనిచేసిన ప్రతిచోటా అగుడు పట్టిన విద్యాశాఖాధికారి రామలింగం నీతులు వల్లించడాన్ని పలువురు చర్చించుకొంటున్నారు. ఇటీవల రామలింగానికి మద్దతుగా విలేకరుల సమావేశం నిర్వహించిన కొందరు ఉపాధ్యాయ సంఘాల ప్రతినిధులను విలేకరులు మీ వద్ద డిఇఓ నిజాయితీపరుడని, ఎమ్మెల్సీ అవినీతి పరుడనేందుకు ఆధారాలు ఏమన్నా వున్నాయా అని ప్రశ్నించినందుకు ఆ టీచర్లు గొడవ పెట్టుకోవడం చర్చనీయాంశమైంది. మొత్తంమీద ఈ వ్యవహారం ముందు ముందు ఎంతదూరం వెళ్తుందో, ఎందరు బయటి వ్యక్తులు రంగంలోకి దిగుతారో తెలియాల్సి వుంది.

# పంచాయితీ ఎన్నికలు విజయవంతం!

## పద్ధతి ప్రకారం నిర్వహించిన ఎజెసి

జిల్లాలో ఇటీవల జరిగిన గ్రామ పంచాయతీ ఎన్నికల నిర్వహణలో అదనపు జాయింట్ కలెక్టర్ సి.హెచ్.పెంచలరెడ్డి భేష్ అనిపించారు. జిల్లా పంచాయతీ ఇన్‌ఛార్జ్ అధికారిగా విధులు నిర్వహిస్తున్న ఎజెసి మూడు విడతలుగా జరిగిన ఎన్నికలలో ముందస్తు ఏర్పాటు చేసుకున్నారు. ఒక ప్రక్క ఎన్నికల సంఘం జారీ చేసిన ఆదేశాలను పాటిస్తూ మరో ప్రక్క కింది స్థాయి అధికారులను సమన్వయం చేసుకుంటూ ముందుకెళ్లారు. పోలింగ్ కేంద్రాలకు సిబ్బంది నియామకం, బ్యాలెట్ బాక్స్‌ల తరలింపు విషయంలో ఏ సమస్యా తలెత్తకుండా జాగ్రత్తలు తీసుకోవడంలో సఫలీకృతమైనారు. ఒకటి, రెండు చోట్ల స్వల్ప వివాదం చోటుచేసుకోవడం మినహా అవాంఛనీయ సంఘటనలు జరగలేదు. జిల్లా కలక్టరేట్‌లో జాయింట్ కలెక్టర్ లక్ష్మీకాంతం ఎన్నికల సరళి, లెక్కింపును వీడియో దృశ్యాల ద్వారా పరిశీలించడం జరిగింది. అన్ని పోలింగ్ కేంద్రాల్లోనూ, ఓట్ల లెక్కింపు కేంద్రాల్లో వెబ్ కెమెరాలను ఏర్పాటు చేశారు. గతంలో నెల్లూరు తహశీల్దార్‌గాను, జిల్లా పరిషత్ సిఇఓగాను జిల్లాలో పని చేసిన అనుభవం వున్న ఆయన్ను అదనపు జిల్లా జాయింట్ కలెక్టర్‌గా పదోన్నతిపై ప్రభుత్వం నియమించింది. జిల్లాపై పట్టు కలిగి వుండడంతో అన్ని గ్రామ పంచాయతీల సమాచారం సేకరించుకున్నారు. సమస్యాత్మక ప్రాంతాలుగా గుర్తించిన గ్రామాల్లో అధికంగా పోలీసులను మోహరించి ఘర్షణలు జరగకుండా చేయగలిగారు. మూడు విడతలుగా జరిగిన ఎన్నికలు ప్రశాంతంగా ముగియడంతో అధికార యంత్రాంగం ఊపిరి పీల్చుకుంది.

● దేశంలో చేపట్టిన

# ఆర్థిక సంస్కరణలు మేలు చేకూర్చలేదు!

**కావలి సదస్సులో జమీన్‌రైతు సంపాదకుడు డోలేంద్రప్రసాద్**



సదస్సులో మాట్లాడుతున్న జమీన్‌రైతు సంపాదకుడు డోలేంద్రప్రసాద్.

ఆర్థిక సంస్కరణలు అనేవి ప్రజల జీవన ప్రమాణాలను పెంచేవిగా వుండాలి తప్ప వారికి నష్టం కల్గించేవిగా వుండకూడదని జమీన్‌రైతు సంపాదకుడు డోలేంద్రప్రసాద్ సూచించారు. కావలి పట్టణంలోని క్లాత్ మర్చంట్స్ అసోసియేషన్ హాలులో "నా" ఫౌండేషన్ ఆధ్వర్యంలో ఆర్థిక సంస్కరణలు – దేశ భవిష్యత్తు అనే అంశంపై జరిగిన సదస్సుకు ఆయన ముఖ్య అతిథిగా పాల్గొని పలు అంశాలపై వివరణాత్మకంగా ప్రసంగించారు. నవభారత నిర్మాణం పేరుతో దేశ సంపదను కొద్ది మంది చేతుల్లో పెడుతుండడంతో పెట్టుబడిదారులు, బడా పారిశ్రామికవేత్తలకు మాత్రమే మేలు జరుగుతున్నాదన్నారు. చైనా తదితర దేశాలలో ఆర్థిక సంస్కరణల కారణంగా ఎంతో అభివృద్ధి జరిగితే మన దేశంలో మాత్రం ఆర్థిక సంస్కరణలు ప్రజల జీవనాన్ని మెరుగు పరచలేకపోతున్నాయన్నారు. దీనికి కారణం పాలకులేనన్నారు. ప్రజల ప్రమేయం లేకుండానే ఈ సంస్కరణలు జరిగిపోతుండడంతో ఈ నష్టం జరుగుతున్నాదని అభిప్రాయపడ్డారు. రైతులకు గిట్టుబాటు ధర లభించడం లేదన్నారు. గ్యాస్, పెట్రోల్ నిక్షేపాలను ప్రైవేట్ సంస్థలకు అప్పగించడం వలన ధరలు పెరిగిపోతున్నాయన్నారు. విదేశాల్లో తయారైన వస్తువులు దేశంలో విచ్చలవిడిగా అమ్మకాలు సాగిస్తుండడం వల్ల దేశ ఆర్థికాభివృద్ధి కుంటు పడిందన్నారు. అన్నదాతలకు ప్రభుత్వం సహాయం అందడం లేదన్నారు. స్వాతంత్ర్యం వచ్చిన సమయంలో అధికంగా వున్న రూపాయి మారకం విలువ ప్రస్తుతం పతనమైపోయిందన్నారు. పాలకులు పెట్టుబడిదారులకు కొమ్ము కాస్తుండడం వల్లే ఇటువంటి నష్టం జరుగుతున్నాదన్నారు. అనంతరం జరిగిన ముఖాముఖి కార్యక్రమంలో పలువురు వివిధ అంశాలపై అడిగిన ప్రశ్నలకు డోలేంద్రప్రసాద్ సమాధానం ఇచ్చారు. నా ఫౌండేషన్ అధ్యక్షుడు సుధాకర్‌రెడ్డి ఆధ్వర్యంలో జరిగిన ఈ కార్యక్రమంలో "బామ" గౌరవాధ్యక్షుడు డాక్టర్ బెజవాడ రవికుమార్ తదితర ప్రముఖులు హాజరయ్యారు.

# కావలిలో వార్డుల విభజనపై రగడ!

● **అధికార పార్టీకి అనుకూలంగా విభజన**

కావలి మున్సిపాల్టీ పరిధిలో కొత్త వార్డుల ఏర్పాటుపై విమర్శలు వ్యక్తం అవుతున్నాయి. గతంలో వుండే ఓటర్ల సంఖ్యకు, కొత్త ఓటర్ల సంఖ్యకు పొంతన లేకపోవడం, మరణించిన వారిని ఓటర్లుగా చూపించడం, మేజర్ ఓటర్ల సంఖ్య అధికంగా వున్న చోట తక్కువగా, తక్కువ మంది వున్న చోట ఎక్కువగా చూపించడం లాంటి చిత్రవిచిత్రాలు చోటుచేసుకొంటున్నాయని పలు వార్డుల్లో వ్యక్తమౌతున్న అభిప్రాయం. గతంలో 30వ వార్డుగా వున్నది ఇప్పుడు 33వ వార్డు అయ్యింది. దీన్ని గమనిస్తే ఇలాంటివి అవగతమవుతాయని మాజీ కౌన్సిలర్లు అమరా వేదగిరి సుబ్బరాయుడు, ఆత్మకూరి బ్రహ్మయ్యలు ఆరోపిస్తున్నారు. వార్డుల్లో జనాభా పెరిగినట్లు అధికారులు తప్పుడు లెక్కలు చూపిస్తున్నారు. వాస్తవానికి జాబితాకు తేడా వుందన్నారు. మరణించిన వారిని, ఈ ప్రాంతం నుంచి వలస వెళ్లిన వారిని ఇక్కడ ఓటర్లుగా చూపించడం దారుణమన్నారు. అధికారులకు దీనిపై ఫిర్యాదు చేసినా ఏమాత్రం పట్టించుకోకుండా నిర్లక్ష్యంగా వ్యవహరిస్తున్నారని విమర్శించారు. జనం లేకున్నా ఓట్లు ఎక్కడ నుంచి వచ్చాయో అధికారులు సమాధానం చెప్పాలని డిమాండ్ చేశారు. జిల్లా కలెక్టర్ దీనిపై స్పందించి విచారణ జరిపి రెవెన్యూ, మున్సిపల్ అధికారులు చేసిన తప్పిదాలను సరిదిద్దాలని వారు కోరారు.

# బుచ్చిలో వైఎస్ఆర్‌సి జోరు

**మండలంలో 8 చోట్ల జయకేతనం**

బుచ్చిరెడ్డిపాళెం మండలంలో జరిగిన పంచాయతీ ఎన్నికల్లో వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీ పూర్తి ఆధిక్యతను ప్రదర్శించింది. మండలంలోని మొత్తం 15 పంచాయతీలలో 8 స్థానాలను వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీ బలపరచిన అభ్యర్థులు గెలుపొందారు. ఏడు స్థానాల్లో తెలుగుదేశం, కాంగ్రెస్, బిజెపి, సిపిఎం బలపరచిన అభ్యర్థులు విజయం సాధించారు. మేజర్ పంచాయతీ అయిన బుచ్చిరెడ్డిపాళెం సర్పంచ్‌గా వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీ అభ్యర్థిని జూగుంట స్నేహలత 2658ఓట్లు ఆధిక్యతతో గెలుపొందారు. దామరమడుగులో సిపిఎం అభ్యర్థి గరికపాటి సురేష్ 1637 ఓట్లతో, రేబాలలో వివిధ పార్టీల ఉమ్మడి అభ్యర్థి మల్లిక మస్తానయ్య 1243 ఓట్లతో, పంచేడులో వైకాపా అభ్యర్థి రమణమ్మ 491 ఓట్ల మెజార్టీతో విజయం సాధించారు. పెనుబల్లిలో సిపిఎం అభ్యర్థి జార్జ్ 113 ఓట్లతో గెలుపొందగా, మున్నులపూడిలో కాగులపాడు, కట్టుబడిపాళెం, జొన్నవాడ, వవ్వేరు, నాగాయగుంట, చెల్లాయపాళెంలలో వైకాపా అభ్యర్థులు తాటిపర్తి బాబు, ఇండ్ల మమత, మంజు భార్గవి, మురళి, బొంతం శేషమ్మ, రాజశేఖర్‌లు విజయం సాధించారు. మినగల్లు, నాగమాంబాపురం, ఇస్కపాళెంలలో ఉమ్మడి అభ్యర్థులు, కీర్తన, వల్లూరు రాఘవరెడ్డి, చిన్నమ్ములు గెలుపొందారు. సిపిఎంకు దామరమడుగులో మంచి మెజార్టీరాగా, పెనుబల్లిలో గొడవ కారణంగా మెజార్టీ స్వల్పంగా వచ్చింది. మొత్తం మీద కొత్తగా ఏర్పాటైన వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీ బుచ్చి మండలంలో తన బలం చాటుకుంది.

● కలువాయిలో పట్టుసాధించిన

# వైఎస్ఆర్ కాంగ్రెస్!

**మండలంలో 9 పంచాయితీలు కైవసం**

ఇటీవల జరిగిన పంచాయతీ ఎన్నికల్లో కలువాయి మండలంలో అధికశాతం పంచాయతీలు వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీ మద్దతుదారులు కైవసం చేసుకొన్నారు. మండలంలోని మొత్తం 20 పంచాయతీలు వుండగా అందులో 5 పంచాయతీలు ఏకగ్రీవం అయ్యాయి. వీటిలో వైసిపి 4 స్థానాలు, కాంగ్రెస్ ఒక్క స్థానాన్ని దక్కించుకొంది. మిగిలిన 15 పంచాయతీలకు ఎన్నికలు జరగగా అందులో 3 చోట్ల త్రిముఖపోటీ, 12 పంచాయతీల్లో ద్విముఖపోటీ ఏర్పడింది. ఈ స్థానాల్లో వైసిపి 5, తెలుగుదేశం 5, కాంగ్రెస్ 2, స్వతంత్ర అభ్యర్థులు 3 సర్పంచ్ స్థానాలను దక్కించుకొన్నారు. మొత్తం 20 పంచాయతీల్లో మూడు పార్టీలు బలాబలాలను పరిశీలిస్తే వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీ అధికంగా 9 స్థానాలను, తెలుగుదేశంపార్టీ 5, కాంగ్రెస్ 2, స్వతంత్ర అభ్యర్థులు 3 సర్పంచ్ స్థానాలను దక్కించుకొన్నారు. వెంకటగిరి నియోజకవర్గ వైసిపి సమన్వయకర్త కొమ్మి లక్ష్మయ్య నాయుడు తమ పార్టీ బలపరచిన అభ్యర్థులతోపాటు తెలుగుదేశం బలపరచిన పెరమకొండ సర్పంచ్ కె.రాజేశ్వరమ్మతో పాటు ముగ్గురు స్వతంత్ర అభ్యర్థులకు వైకాపా కండువాలు కప్పి మండలంలో అధికంగా 13 స్థానాల్లో వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీ గెలుపొందినట్లు ప్రకటించుకొన్నారు. మొత్తం నియోజకవర్గ పరిధిలో సగానికిపైగా స్థానాలు తమ పార్టీనే గెలుచుకొందన్నారు. పిసిసి ఉపాధ్యక్షుడు మాదాసు గంగాధరం తన స్వగ్రామమైన కుల్లూరులో తన బలం ఏమాత్రం తగ్గలేదని నిరూపించాడు. సర్పంచ్‌గా తన అనుచరుడు భూపతి కొండయ్యను 515 ఓట్ల మెజార్టీతో గెలిపించుకోవడంతోపాటు కుల్లూరు పంచాయతీలోని మొత్తం 14 వార్డులలో 11 వార్డులను దక్కించుకొన్నాడు. ఎలాగైనా మాదాసు నిలబెట్టే అభ్యర్థిని ఓడించి గట్టి దెబ్బ కొట్టాలని కుల్లూరు, కలువాయి వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీ నేతలు చేసిన ప్రయత్నాలు ఫలించలేదు.

ఉదయగిరిలో

# పుంజుకొన్న తెలుగుదేశం!

**కష్టపడిన బొల్లినేని రామారావు**



ఉదయగిరి నియోజకవర్గంలో తెలుగుదేశంపార్టీ బలపరచిన అభ్యర్థులు అత్యధికంగా సర్పంచ్‌లుగా ఎన్నిక కావడం సంతోషకరమని నియోజకవర్గ తెలుగుదేశంపార్టీ ఇన్‌ఛార్జ్ బొల్లినేని రామారావు వ్యాఖ్యానించారు. నియోజకవర్గ పరిధిలోని ఉదయగిరి, దుత్తలూరు, వరికుంటపాడు, సీతారామపురం, వింజమూరు, కొండాపురం, కలిగిరి, జలదంకి మండలాల్లోని వివిధ పంచాయతీలను కైవసం చేసుకొన్న తెలుగుదేశంపార్టీ బలపరచిన అభ్యర్థులను అభినందించారు ఆయన. ఈ సందర్భంగా రామారావు మాట్లాడుతూ నియోజకవర్గ పరిధిలో మొత్తం 54 మంది సర్పంచ్‌లుగా, పలువురు వార్డు సభ్యులుగా ఎన్నిక కావడం ప్రజల్లో తమ పార్టీ పట్ల, తమపట్ల వున్న అభిమానానికి నిదర్శనం అన్నారు. నియోజకవర్గంలోని తెలుగుదేశంపార్టీ కార్యకర్తలు, ఓటర్ల కృషితో ఈ విజయం సాధించగలిగామన్నారు. 2014లో జరిగే శాసనసభ ఎన్నికల్లో సైతం తెలుగుదేశంపార్టీ ఘన విజయం సాధించి రాష్ట్రంలో ప్రభుత్వం ఏర్పాటు చేయడం ఖాయమని ధీమా వ్యక్తం చేశారు. ఈ సందర్భంగా పలువురు పంచాయతీ సర్పంచ్‌లకు, వార్డు సభ్యులకు కండువాలు కప్పి పంచాయితీల అభివృద్ధికి కృషి చేయాలన్నారు.

# బుచ్చిలో మహిళా చైతన్యం!

● **ఓటు వేయను పోటీపడిన అతివలు**



పంచాయతీ ఎన్నికల్లో బుచ్చి మండలంలోని మహిళా ఓటర్లే అధికంగా ఓటు హక్కును వినియోగించుకొన్నారు. మండలంలో 25,034 మంది పురుషులు, 26,777 మంది మహిళ ఓటర్లు వున్నారు. రెండో విడత జరిగిన పంచాయతీ ఎన్నికల్లో 23,454 మంది మహిళలు ఓటు హక్కు వినియోగించుకోగా 22,551 మంది పురుషులు ఓటు వేశారు. మండలం మొత్తంమీద చెల్లని ఓట్లు అధికంగానే పడ్డాయి. మొత్తం 1993 చెల్లని ఓట్లు కాగా ఒక్క బుచ్చిలోనే 606 ఓట్లు వుండడం విశేషం. అంటే డబ్బు పంపకం కారణంగానే ఇరువురు అభ్యర్థులకు వాటిని తీసుకొన్న వారు ఓటేశారని ఈ చెల్లని ఓట్లు చెబుతున్నాయని మండల ప్రజలు వ్యాఖ్యానిస్తున్నారు.

● సోమశిలకు

# కృష్ణాజలాలు విడుదల చేయించండి!



**వెంకటగిరి ఎమ్మెల్యే డిమాండ్!**

సోమశిలకు రావాల్సిన కృష్ణాజలాలను విడుదల చేయడంలో ప్రభుత్వం నిర్లక్ష్యంగా వ్యవహరిస్తోందని వెంకటగిరి ఎమ్మెల్యే కురుగొండ్ల రామకృష్ణ విమర్శించారు. ఇటీవల డక్కిలి వచ్చిన ఆయన విలేకరులతో మాట్లాడారు. భారీవర్షాలు కురిసి కృష్ణమ్మ పరవళ్లు తొక్కుతున్నా న్యాయబద్ధంగా సోమశిలకు విడుదల కావాల్సిన నీటిని మంత్రుల నిర్లక్ష్యం కారణంగా విడుదల చేయడం లేదన్నారు. ముఖ్యమంత్రి సొంత జిల్లాకు నీటిని తరలించేందుకు చూపుతున్న శ్రద్ధ జిల్లా రైతాంగంపై చూపడం లేదన్నారు. గతంలో ఇదే కృష్ణాజలాలను సోమశిలకు విడుదల చేయకుండా తమిళనాడుకు తరలిస్తున్నారంటూ ఆనం రామనారాయణరెడ్డి కండలేరు హెడ్‌రెగ్యులేటర్ వద్ద ఆమరణదీక్షకు దిగారని, ఇప్పుడు అధికారంలో వున్న ఆయనకు ఈ సమస్య ఎందుకు గుర్తుకు రాలేదని ప్రశ్నించారు. కృష్ణాజలాలను సోమశిలకు విడుదల చేస్తే అక్కడ నుంచి కండలేరుకు విడుదలవుతాయన్నారు. దీనివల్ల సాగునీటి కోసం తీవ్ర ఇబ్బందులు పడుతున్న రైతులకు కొంత మేర ప్రయోజనం కల్గుతుందన్నారు. దీనిపై ప్రభుత్వం సరిగ్గా స్పందించకపోతే తెలుగుదేశంపార్టీ ఆధ్వర్యంలో ఆందోళన చేపడుతామని హెచ్చరించారు.

# పెచ్చులూడిపడుతున్న పాఠశాల పైకప్పు!

● నాగులవరంలో ఇదీ పరిస్థితి.



దుస్థితిలో నాగులవరం ప్రాథమిక పాఠశాల. (ఇన్‌సెట్‌లో పెచ్చులూడుతున్న స్లాబ్)

బోగోలు మండలం నాగులవరం ప్రాథమిక పాఠశాల ప్రమాదకరంగా మారింది. పాఠశాల భవనం శ్లాబ్ పెచ్చులూడి పడుతుండడంతో విద్యార్థులు భయభ్రాంతులకు గురౌతున్నారు. ఈ పాఠశాలను 1984లో నిర్మించారు. కొద్దికాలానికే ఈ భవనం శిథిలావస్థకు చేరుకొనింది. ఆనాటి నుంచి పాఠశాల భవనం దెబ్బతిని ప్రమాద స్థితికి చేరుకున్నా ఎవరూ పట్టించుకోలేదు. పాఠశాలకు వచ్చే విద్యార్థులు ఎప్పుడు భవనం పైకప్పు కూలుతుందోనని భయం భయంగా కాలం వెళ్లదీయాల్సిన పరిస్థితులు నెలకొన్నాయి. జూలై 19వ తేదిన తరగతి గదుల్లోని శ్లాబ్, వరండాలోని పైకప్పు ఒక్కసారిగా పెచ్చులూడిపడడంతో అక్కడ చదువుకొంటున్న విద్యార్థులు భయంతో కేకలు వేస్తూ పరుగులు తీశారు. ఎప్పుడు ఏం జరుగుతుందో, ఎక్కడ ప్రమాదాలకు గురౌతామోనని విద్యార్థులు ఆందోళన చెందుతున్నారు. పిల్లల తల్లిదండ్రులు తమ పిల్లలను బడికి పంపించాలంటేనే హడలిపోతున్నారు. పాత కలెక్టర్ శ్రీధర్ పాఠశాల భవనం శిథిలావస్థకు చేరుకోవడాన్ని గమనించి పునర్నిర్మాణం కోసం సంబంధిత ఇంజనీరింగ్ అధికారులను పిలిచి అంచనాలు సిద్ధం చేయమని చెప్పినా అది కార్యరూపం దాల్చలేదు. ఈ పరిస్థితుల్లో పాఠశాలకు వచ్చే పిల్లలు చెట్లక్రింద చదువుకోవాల్సి వస్తోంది. అధికారులు పిల్లల ఇబ్బందులను, పాఠశాల దుస్థితిని గుర్తించి తక్షణం నూతన భవనాలు నిర్మించాలని స్థానికులు కోరుకొంటున్నారు.

● గూడూరు కమిషనర్

# వాహనాన్ని తగులబెట్టబోయారు!

**కఠినంగా విధి నిర్వహణే కారణం**

గూడూరు మున్సిపల్ కమిషనర్ సుశీలమ్మకు చెందిన అధికార వాహనం తగులబడడం కలకలం రేపింది. ఇటీవల కార్యాలయానికి వచ్చిన కమిషనర్ తన కారును అక్కడే వుంచారు. ఉన్నట్లుండి రాత్రివేళ వాహనం తగులబడుతుండడాన్ని ప్రక్కనే గల డిఎస్పీ కార్యాలయంలోని పోలీసులు గుర్తించి మంటలను అదుపు చేసి కమిషనర్‌కు సమాచారం అందించారు. ఆమె అక్కడకు చేరుకొని విచారణ జరిపింది. అనంతరం ఆమె పోలీసులకు ఈ ఘటనపై ఫిర్యాదు చేసింది. కార్యాలయంలోని నైట్ వాచ్‌మెన్, మరో గుమస్తా కలసి ఈ దుశ్చర్యకు పాల్పడి వుంటారని అనుమానం వ్యక్తం చేసింది. పోలీసులు కమిషనర్ ఫిర్యాదుతో వారిద్దరిని అదుపులోకి తీసుకొని విచారణ చేపట్టారు. విధి నిర్వహణలో కఠినంగా వ్యవహరిస్తున్న కమిషనర్ వ్యవహారశైలి మింగుడుపడని ఉద్యోగులు కొందరు వెనుకవుండి ఈ పని చేయించి వుంటా రన్న అనుమానాలు వ్యక్తం అవుతున్నాయి.

# నిమ్మ అధిక దిగుబడికి సూచనలు!

**పెట్లూరు నిమ్మ పరిశోధన కేంద్రం ప్రిన్సిపల్**

ప్రస్తుతం కురుస్తున్న వర్షాల కారణంగా జిల్లాలో నిమ్మసాగు చేసే రైతులు తగిన జాగ్రత్తలు పాటించాలని వెంకటగిరి మండలం పెట్లూరు నిమ్మ చీనీ పరిశోధనా కేంద్రం ప్రిన్సిపల్ శాస్త్రవేత్త డాక్టర్ బిజి రాజులు సూచించారు. ఇటీవల ఈ ప్రాంతంలోని తోటలను పరిశీలించిన ఆయన రైతులకు పలు సలహాలు ఇచ్చారు. నిమ్మలో ఈ సీజన్‌లో తగిన జాగ్రత్తలు వహించినట్లయితే అధిక దిగుబడులు సాధించవచ్చాన్నారు. నిమ్మలో వచ్చే ఎండు పుల్లలను ఎప్పటికప్పుడు కత్తిరించి దూరంగా తగలబెట్టాలని, రసాయన ఎరువులు తగు మోతాదులో వాడాలన్నారు. ఆ సమయంలో బోర్డు మిశ్రమాన్ని పిచికారీ చేయాలన్నారు. పరిశోధనా కేంద్రానికి అనుబంధంగా ఏర్పాటుచేసిన నర్సరీల్లో నిమ్మ, బత్తాయి, సపోట, జామ, పనస తదితర పండ్ల మొక్కలను రైతులకు అందుబాటులోకి తెస్తామన్నారు. తెగుళ్లు, నీటి ఎద్దడిని తట్టుకొని తక్కువ పెట్టుబడితో అధిక దిగుబడులిచ్చే మేలురకం ఉద్యానవన సాగు మొక్కలను రైతులకు అందుబాటులోకి తెచ్చేందుకు కృషి చేస్తున్నామన్నారు.

● కావలి పెద్దాస్పత్రిలో...

# వైద్యం గగనకుసుమం!

కావలి పట్టణంలో గల ప్రభుత్వ ఆస్పత్రిలో పేదలకు వైద్యసేవలు అందడంలేదు. పేరుకు వంద పడకల ఆస్పత్రి అయినా ఇక్కడ పని చేసే వైద్యులు, సిబ్బందిలో సేవాభావం కొరవడడంతో కొంతకాలంగా ఈ ఆస్పత్రి విమర్శలపాలవుతోంది. విధులకు సరిగా హాజరుకాకపోవడం, వచ్చినా తాము అడిగినంత ముట్టజెప్పందే వైద్యం అందించరనే ఆరోపణలు వెల్లువెత్తుతున్నాయి. చుట్టుప్రక్కల ప్రాంతాల నుంచి వైద్యం కోసం ఇక్కడికి వచ్చే రోగులు ఆస్పత్రి సిబ్బంది దెబ్బకు బావురుమంటున్నారు. కొందరు నిజాయితీగా వైద్య సేవలు అందిస్తున్నా అధికభాగం సిబ్బంది జలగల్లా మారి లంచాల కోసం ఆస్పత్రికి వచ్చే రోగులను పీల్చిపిప్పి చేస్తుండడంతో రోగులు పలుమార్లు దీనిపై ఫిర్యాదు చేసి వున్నారు. ఇటీవల జలదంకి మండలానికి చెందిన ఒక మహిళ వైద్యం కోసం ఇక్కడకురాగా వైద్య సిబ్బంది డబ్బులకోసం పీడించడంతో ఆమె స్థానిక శాసనసభ్యుడు బీద మస్తాన్‌రావుకు ఆస్పత్రి తీరును, వైద్యులు, సిబ్బంది లంచావతారాన్ని వివరించగా ఆయన వైద్యులకు క్లాస్ తీసుకున్నా ఫలితం లేదు. వారిలో మార్పు రాలేదు. బీద మస్తాన్‌రావు ఆస్పత్రి ఛైర్మన్‌గా వ్యవహరిస్తూ ఆస్పత్రికి వచ్చే నిధులు దుర్వినియోగం కాకుండా, చివరకు ఆస్పత్రికి సంబంధించిన బాడుగలను ఆస్పత్రికి ఖర్చు చేస్తుండడంతో మింగుడుపడని వైద్యులు రోగులను దోచుకతింటున్నారనే విమర్శలు వ్యక్తం అవుతున్నాయి. కొత్త కలెక్టర్ ఈ ఆస్పత్రి వ్యవహారంపై దృష్టి సారించి గాడిలో పెట్టాలని పలువురు కోరుకొంటున్నారు.

● ఇళ్ల వద్దకే

# పట్టాదారు పాసుపుస్తకాలు!

**నాయుడుపేటలో జాయింట్ కలెక్టర్ ప్రకటన**

ఇకపై పట్టాదారు పాసుపుస్తకాలు సంబంధిత వ్యక్తుల ఇళ్లకే అందజేయబడతాయని జిల్లా జాయింట్ కలెక్టర్ లక్ష్మీకాంతం ప్రకటించారు. ఇటీవల నాయుడుపేట వచ్చిన ఆయన స్థానిక సబ్‌రిజిస్ట్రార్ కార్యాలయం, తహశీల్దార్ కార్యాలయంను సందర్శించిన అనంతరం విలేకరులతో మాట్లాడారు. పట్టాదారు పాసుపుస్తకాలు కావాలంటే రైతులు కాళ్లరిగేలా తహశీల్దార్ కార్యాలయం చుట్టూ తిరగాల్సి వచ్చేదని, ఇకపై ఆ సమస్యలు వుండవన్నారు. భూమి రిజిస్ట్రేషన్ జరిగిన వెంటనే వారి ఇంటికే నేరుగా పట్టాదారు పాసుపుస్తకాలు అందుతాయని తెలిపారు. అలాగే భూముల రిజిస్ట్రేషన్‌లోను మార్పులు చోటు చేసుకొన్నాయన్నారు. ఇప్పటివరకు టైటిల్ డీడ్, పట్టాదారు పాసుపుస్తకాల ఆధారంగా భూమి రిజిస్ట్రేషన్ చేయించుకొనేవారని తెలిపారు. ఇకపై రిజిస్ట్రేషన్ చేయించుకోవాలంటే ముందు స్థానిక తహశీల్దార్ కార్యాలయంలోని ఫారం 1బిలో పేరు నమోదై వుంటేనే రిజిస్ట్రేషన్ జరుగుతుందన్నారు. సబ్‌రిజిస్ట్రార్ కార్యాలయంలో రిజిస్ట్రేషన్ అయిన తర్వాత వాటి వివరాలు తహశీల్దార్ కార్యాలయంలోని ప్రత్యేకంగా ఏర్పాటు చేసిన విభాగానికి చేరుతాయన్నారు. దీన్ని పరిశీలించిన తహశీల్దార్ సంబంధిత వ్యక్తులకు ఫారం 8 నోటీసులు ఇస్తారన్నారు. వాటిపై ఇరువర్గాలకు అభ్యంతరం లేదని తేలిన తర్వాత ఇంటర్నెట్‌తో అనుసంధానిస్తారని ఆ తర్వాతే రిజిస్ట్రేషన్ చేసి పట్టాదారు పాసు పుస్తకాలను పోస్టు ద్వారా ఇంటికి పంపుతారని తెలిపారు.

# ఉపాధ్యాయుల ఆందోళన పథం!

అపరిష్కృతంగా వున్న ఉపాధ్యాయుల సమస్యల పరిష్కారం కోసం ఆగష్టు 6,7 తేదీల్లో రాష్ట్రవ్యాప్తం ఆందోళన చేపడుతున్నట్లు స్టేట్ టీచర్స్ యూనియన్ (ఎన్‌టియు) రాష్ట్ర ప్రధాన కార్యదర్శి కత్తి నరసింహారెడ్డి తెలిపారు. కావలిలో జరిగిన ఎన్‌టియు ప్రాంతీయ సమావేశానికి ఆయన ముఖ్యఅతిథిగా పాల్గొని ప్రసంగించారు. ఉపాధ్యాయుల న్యాయమైన డిమాండ్లను పరిష్కరించడంలో ప్రభుత్వం నిర్లక్ష్యంగా వ్యవహరిస్తోందన్నారు. అందుకోసమే రాష్ట్రవ్యాప్త ఆందోళనకు పిలుపునిస్తున్నట్లు తెలిపారు. రాష్ట్రవ్యాప్తంగా ఖాళీగా వున్న 960 ఎంఇఓ పోస్టులను, 80 డిప్యూటీ డిఇఓ పోస్టులను నిబంధనల ప్రకారం భర్తీ చేయాలని డిమాండ్ చేశారు. ఉద్యోగ, ఉపాధ్యాయ, ఫించనుదారులకు హెల్త్‌కార్డులు ఇవ్వాలని, స్పెషల్ టీచర్లకు ఇంక్రిమెంట్లు ఇవ్వాలని డిమాండ్ చేశారు. రాష్ట్రంలో ప్రాథమిక విద్యా వ్యవస్థ గాడి తప్పుతున్నాదన్నారు. దీనిని దృష్టిలో వుంచుకొని

### ఎస్టీయూ రాష్ట్ర కార్యదర్శి కత్తి!

కేరళ, తమిళనాడు రాష్ట్రంలో అవలంభిస్తున్న విద్యా విధానాన్ని మన రాష్ట్రంలోను అమలు చేయాలన్నారు. ఈ సమావేశంలో ఎస్‌టియు నేతలు సుదర్శనం, కోటేశ్వరరావు, ఆర్యరావు, ఎంవి.కృష్ణ తదితరులు పాల్గొన్నారు.




కార్పొరేషన్ పారిశుధ్య కార్మికులకు కనీస వేతనం చెల్లించాలని కోరుతూ నెల్లూరు మునిసిపల్ కార్యాలయం వద్ద రిలే నిరాహార దీక్షలు చేస్తున్న కార్మికులతో మాజీ డిప్యూటీ మేయర్ మాదాల వెంకటేశ్వర్లు.

# వైఎస్ మరణం వెనుక ఎన్నో అనుమానాలు!

### పొదలకూరులో కాకాణి ఆరోపణ



మాజీ ముఖ్యమంత్రి దివంగత వైఎస్ రాజశేఖర్‌రెడ్డి హెలికాప్టర్ ప్రమాదంలో మరణించడం వెనుక ఎన్నో అనుమానాలున్నాయని జిల్లా పరిషత్ మాజీ ఛైర్మన్, వైఎస్‌ఆర్ కాంగ్రెస్ పార్టీ సర్వేపల్లి నియోజకవర్గ సమన్వయకర్త కాకాణి గోవర్ధన్‌రెడ్డి ఆరోపించారు. ఆ ఘటన జరిగిన నాటి నుంచి రాష్ట్రంలోని ప్రజలందరూ ఇదే అనుమానాన్ని వ్యక్తం చేస్తున్నారన్నారు. హెలికాప్టర్ ప్రమాద ఘటనపై జరిగిన విచారణలోను అనేక సందేహాలు వ్యక్తమవుతున్నాయన్నారు. వివరాలు నిక్షిప్తం అయ్యి వుండే బ్లాక్ బాక్స్‌లో సంకేతాలు జామ్ అయ్యాయని చెప్పడం ఈ అనుమానాలకు బలం చేకూర్చేలా వుందన్నారు. పంచాయతీ ఎన్నికలను పురస్కరించుకొని ఇటీవల పొదలకూరులో పర్యటించిన ఆయన సాధారణంగా చేసే రాజకీయ విమర్శలను కాకుండా వైఎస్ రాజశేఖర్‌రెడ్డి మరణంపై అనుమానాలంటూ ప్రజల సమక్షంలో మాట్లాడడం చర్చనీయాంశమయ్యింది. ఈ ఘటనపై ఎన్నో అనుమానాలు వ్యక్తం చేసిన ఆయన స్థానిక సంస్థల ఎన్నికలను రెండేళ్ల తర్వాత జరిపిస్తున్న కాంగ్రెస్ ప్రభుత్వ వైఖరిని దుయ్యబట్టారు. వైఎస్ జగన్ పట్ల ప్రజల్లో వున్న అభిమానానికి ఆందోళన చెందిన కాంగ్రెస్, తెలుగుదేశంపార్టీలు కుయుక్తులు, కుట్రలు పనుతున్నారని విమర్శించారు. వచ్చే శాసనసభ ఎన్నికల్లో తమ పార్టీ అధికారంలోకి రావడం ఖాయమన్నారు.

# వెంకటగిరిలో పారిశుధ్యం పాతర!

### పట్టించుకోండి కమిషనర్ గారు

వెంకటగిరి పట్టణంలో పారిశుధ్యం అస్తవ్యస్తంగా మారింది. ఎక్కడికక్కడ చెత్త పేరుకపోతుండడం, మురుగునీరు రోడ్లపై పారుతుండడంతో పట్టణంలో పరిస్థితి దారుణంగా తయారయ్యింది. రోజూ చెత్తను శుభ్రం చేయకపోవడం, చెత్త ఎత్తేసే వాళ్లు లేకపోవడంతో అపరిశుభ్ర వాతావరణం నెలకొనింది. మంచినీటి కొళాయిలు వుండే చోటా మురుగునీరు చేరి వుండడంతో మంచినీటిని పట్టుకొనే వాళ్లు తీవ్ర ఇబ్బందులు పడుతున్నారు. దీనికితోడు వర్షాలు కురుస్తుండడంతో వర్షపు నీటిలో మురుగునీరు చేరి రోడ్లలో నడవాలంటేనే రోతపుట్టేలా వుండడంతో పట్టణ ప్రజలు తీవ్ర అసౌకర్యానికి గురైతున్నారు. ఉపాధ్యాయనగర్, బోప్పాపురం, బి.సి.కాలని, గాజుల వీధి, తోలుమిట్ట, కాంపాళెం, ఎన్టీఆర్‌కాలని, ధర్మపురం తదితర ప్రాంతాల్లో పారిశుధ్యం పూర్తిగా లోపించింది. మున్సిపాల్టీలో పారిశుధ్య కార్మికులు వున్నా సక్రమంగా చెత్తను పారవేయకపోవడం, ముందుగా కాల్వలను శుభ్రం చేయక పోతుండడంతో ఎక్కడ అంటువ్యాధులు ప్రబలుతాయోనని ప్రజలు హడలిపోతున్నారు. దీనిపై పలువురు మున్సిపల్ అధికారులకు విన్నవించినా ఫలితం లేకుండా పోయిందని వాపోతున్నారు. వర్షాకాలాన్ని దృష్టిలో వుంచుకొని పారిశుధ్యాన్ని మెరుగుపరచడంలో అధికారులు తగినశ్రద్ధ వహించాల్సి వుంది.

# నాణ్యమైన భోజనం పెట్టండి!

మధ్యాహ్న భోజనం తయారీలో నాణ్యతాప్రమాణాలు సక్రమంగా పాటించాలని వెంకటగిరి తహశీల్దార్ ఎంవి.కృష్ణమూర్తి ఆదేశించారు. ఇటీవల బీహార్‌లో మధ్యాహ్న భోజనం కలుషితమై పలువురు విద్యార్థులు ప్రాణాలు పోగొట్టుకొన్న ఘటన నేపథ్యంలో ఆయన మండలానికి మధ్యాహ్న భోజన తయారీపై దృష్టి సారించారు. మండలంలోని పారవోలు పాఠశాలతోపాటు పలు పాఠశాలలకు వెళ్లిన తహశీల్దార్ అక్కడ విద్యార్థులకు పెడుతున్న ఆహారాన్ని పరిశీలించారు. ఈ సందర్భంగా ఉపాధ్యాయులు, మధ్యాహ్న భోజన నిర్వాహకులనుద్దేశించి పలు సూచనలు చేశారు. భోజనానికి అవసరమైన వస్తువుల్లో నాణ్యత పాటించాలని, వండే పాత్రలను శుభ్రంగా వుంచుకోవాలన్నారు. పాఠశాలల్లోని విద్యార్థులకు భోజనం పెట్టే ముందు ఆయా పాఠశాలల్లోని ప్రధానోపాధ్యాయులు, ఉపాధ్యాయులు ముందుగా రుచి చూసిన తర్వాతే పిల్లలకు పెట్టాలన్నారు. మండల విద్యాధికారులు ప్రతివారం భోజన నిర్వాహకులతో సమావేశం నిర్వహించి నాణ్యతపై అవగాహన కల్పించాలన్నారు. బియ్యం కొరత లేకుండా చూసేలా డీలర్లకు తగిన ఆదేశాలు జారీ చేశామన్నారు.

# అల్లా కృప అమితంగా లభించే రంజాన్ మాసం!



పవిత్రతే పరమపద సోపానంగా భావించే ముస్లిం సోదరులు జరుపుకొనే పండుగ రంజాన్. నెలరోజులపాటు ఉపవాసం వుండి ఆత్మ ప్రక్షాళనకు త్రికరణ శుద్ధిగా దేవుని ప్రార్థించే మాసంలో అంతులేని వినీలగగనాన్ని చుంబిస్తూ ముచ్చటగా ముస్తాబైనట్లు వెలుగులు విరజిమ్మే నెల వంక కన్పించిన రోజును రంజాన్‌గా జరుపుకొంటారు. ఇది ఆనవాయితీగా వస్తున్న ఆచారం. నెల రోజులపాటు అనగా నెలపొడుపును చూసిన రోజు నుంచి మొదలు అయ్యే రంజాన్ మాసం నుండి ఉపవాస దీక్షలు ఆరంభమవుతాయి. తిరిగి మళ్లీ నెలరోజులు తర్వాత కన్పడే నెలవంకను చూసిన తర్వాత ఉపవాస దీక్షలు విరమిస్తారు. ఆనాడే రంజాన్ పండుగను ఘనంగా భక్తిశ్రద్ధలతో జరుపుకొంటారు. పండుగరోజున సామూహిక నమాజులు నిర్వహిస్తారు.

రంజాన్ పండుగతో ఉపవాస దీక్షలు విరమిస్తున్నప్పటికీ అసలు ఉపవాసలక్షణం మాత్రం ఆహారం తీసుకోకపోవడం మాత్రమే కాదు. చెడు ప్రవర్తనలకు, చెడు చేష్టలకు దూరంగా వుంటూ ఆత్మశుద్ధి చేసుకోవడం తద్వారా భగవంతుని దీవెనలు పొందడం ఈ ఉపవాస దీక్షల లక్ష్యం. రంజాన్ నెలలో భగవంతుని ఆరాధన రాత్రి వేళ మొదలవుతుంది. దాసుడు తన దైవంతో సంబంధాన్ని పటిష్టం చేసుకొనే సమయం అదే. అల్లాను ఆర్తితో ప్రార్థించినపుడే ఆయన ఆశీస్సులు లభిస్తాయని చెప్తారు మత పెద్దలు. భగవంతుడిని పలు రకాలుగా ఆరాధిస్తారు. అందులో నమాజ్ అనే ఆరాధన ఉత్తమోత్తమైన ఆరాధన. అందులోను ఫర్జ్ ఆరాధన తప్పని సరి. దీనిని ఎలాంటి క్లిష్ట పరిస్థితుల్లోను విడవకూడదని మహమ్మద్ ప్రవక్త సూచించినట్లు చెబుతారు. కొన్ని ప్రత్యేక సందర్భాలలో మాత్రం కొంత సడలింపు వున్నప్పటికీ నమాజ్ విధిని తప్పక ఆచరించాలి. మనిషిలో జీవం వున్నంతవరకు నమాజ్ చదవడం మాత్రం తప్పనిసరి అని చెప్తారు. మహమ్మద్‌ప్రవక్త నడవలేని స్థితిలో కూడా తన అనుచరులైన హజ్రత్ అలీ, హజ్రత్ అబ్బాస్ సహకారంతో నమాజ్ చేసేవారని చెప్తారు. దీన్ని బట్టే నమాజ్ విలువ, ప్రాముఖ్యం అర్థమవుతుంది. ఈ రంజాన్ మాసంలో ప్రత్యేకంగా చేసే నమాజ్ తరావీ నమాజ్. ఈ నమాజ్ ఇషా నమాజ్ తర్వాత ప్రత్యేకంగా చదువుతారు. తరావీ నమాజ్ చేయడం, దైవారాధన చేయడం, దైవ నామస్మరణలో గడపడం పుణ్యప్రదం. ఎవరైతే నిష్కల్మషమైన మనస్సుతో, భగవంతునిపై సంపూర్ణ విశ్వాసంతో ప్రార్థన చేస్తారో వారికి ఆ అల్లా ఆశీస్సులు లభిస్తాయని, అపరాధాలు క్షమించబడతాయని మహమ్మద్ ప్రవక్త బోధించిన సూక్తులు. అందుకే ప్రతి ముస్లిం దైవభక్తితో కూడిన నిస్వార్థ పరత్వంతో ఆత్మశుద్ధి చేసుకొని రంజాన్ పండుగ జరుపుకొంటాడు.



రచ్చబండ

# అధికారులకు సవాల్‌గా మారనున్న రచ్చబండ!

**గతంలో స్వీకరించిన వినతిపత్రాలపై సకాలంలో చర్యలు తీసుకోకపోవడం, చేసిన హామీలు నెరవేర్చకపోవడం వంటి కారణాలతో మూడవ విడత రచ్చబండ కార్యక్రమానికి హాజరవ్వను అధికారులు భయపడుతున్నారు.**

రాష్ట్రప్రభుత్వం ఆగష్టు 8వతేది నుండి 3వ విడత రచ్చబండ కార్యక్రమాన్ని నిర్వహించాలని నిర్ణయించింది. గ్రామ పంచాయతీ ఎన్నికల సందర్భంగా ఎన్నికల కోడ్ అమల్లో వుండడంతో గత నెలలో ఈ రచ్చబండను నిర్వహించలేకపోయింది. ఎన్నికలు పూర్తి కావడంతో రచ్చబండకు శ్రీకారం చుట్టింది. మొన్నటివరకు గ్రామపంచాయతీ ఎన్నికల ఏర్పాట్లలో బిజిగా వున్న అధికార యంత్రాంగం వారం రోజుల విరామం అనంతరం తిరిగి రచ్చబండ కార్యక్రమానికి సంసిద్ధులవుతున్నారు. ఈనెల 8 నుండి 28వతేది వరకు ఈ కార్యక్రమం జరగనుంది. నియోజకవర్గాల వారీగా కార్యక్రమం అమలుకు సంబంధించి కసరత్తు ప్రారంభమైంది. ముందుగా ప్రణాళికను రూపొందించుకోవాలని ప్రభుత్వం నుండి జిల్లాకు ఆదేశాలు జారీ అయ్యాయి.

3వ విడత నిర్వహించే రచ్చబండ కార్యక్రమంలో రేషన్‌కార్డుల మంజూరు, ఇందిరమ్మ గృహాల మంజూరు, వృద్ధాప్య, వితంతు, వికలాంగుల పెన్షన్ల మంజూరుతోపాటు వివిధ సంక్షేమ అభివృద్ధి పథకాలపై దృష్టి సారించనున్నారు. నియోజకవర్గాల పరిధిలోని మండలాల్లో అధికారికంగా పర్యటనలపై ఎమ్మెల్యేలతో సంప్రదించి తేదీలను మండలస్థాయి అధికారులు ఖరారు చేసుకోవాలి. ఇప్పుడు జరుగనున్న రచ్చబండ కార్యక్రమంలో ఇటీవల ఎన్నికైన గ్రామపంచాయతీ సర్పంచ్‌లు పాల్గొనే అవకాశం వుంది. తొలి, రెండవ విడతలో నిర్వహించిన రచ్చబండ కార్యక్రమంలో రేషన్‌కార్డులు మంజూరు చేయాలని వేలాదిగా దరఖాస్తులు స్వీకరించారు. వీటిలో కొన్నింటిని పరిష్కరించారు. మరికొన్ని వివిధ కారణాల చేత అపరిష్కృతంగా మిగిలిపోయాయి. అలాగే పెన్షన్లు, ఇందిరమ్మ గృహాలకు సంబంధించి దరఖాస్తులు అందాయి. వీటిపై ప్రభుత్వ నిర్ణయం తీసుకోవాల్సి వుంది.

ఈ నేపథ్యంలో రచ్చబండ పేరుతో గ్రామాలకు వెళితే ప్రజల నుండి ఇబ్బందులు ఎదుర్కోవాల్సి వుంటుందని అధికారులు అభిప్రాయపడుతున్నారు. గతంలో స్వీకరించిన వినతి పత్రాలపై సకాలంలో చర్యలు తీసుకోకపోవడంతో ప్రజలు అధికారులను నిలదీసే అవకాశం వుంది. గ్రామాలకు వెళ్లినప్పుడు ప్రజాప్రతినిధులతోపాటు మండల స్థాయి అధికారులు అనేక హామీలు ఇచ్చి వెళుతుంటారు. అప్పుడు చేసిన వాగ్దానాలు గురించి తర్వాత మరచిపోతుంటారు. ఏడాది తర్వాత తిరిగి రచ్చబండ కార్యక్రమం ప్రభుత్వం నిర్వహిస్తుండడంతో ప్రజలకు ఏం సమాధానం చెప్పాలని అధికారులు తలలు పట్టుకుంటున్నారు. ఇటీవల ప్రభుత్వ ప్రవేశపెట్టిన అమ్మహస్తం పేరిట రేషన్‌షాపుల్లో 9 రకాల నిత్యావసర సరుకులు అందించాలి. కాని ఇవి సక్రమంగా లబ్దిదారులకు పంపిణీ జరగడం లేదు. రెవెన్యూ, పౌరసరఫరాలశాఖ మధ్య సమన్వయం లేకపోవడం ఇందుకు కారణమని చెప్పవచ్చు.

అలాగే గతంలో మంజూరు చేయబడిన ఇందిరమ్మ గృహాలు పూర్తికాక అధికారుల తీరుకు నిదర్శనంగా మొండిగోడలకే పరిమితమై పోయాయి. ఏ కారణం చేత గృహాలు పూర్తికాకుండా నిలచిపోయాయో అధికారులకే తెలియాల్సి వుంది. వీటిపై కూడా సంబంధితశాఖ అధికారులు నిరసనలు ఎదుర్కోక తప్పదు. రెవెన్యూశాఖకు సంబంధించి అనేక వినతి పత్రాలు మండల తహశీల్దార్ కార్యాలయాల్లో బూజుపట్టి వున్నాయి. భూసమస్యలపై రెవెన్యూశాఖ సక్రమంగా స్పందించడం లేదన్న విమర్శలు వినిపిస్తున్నాయి. కొత్తగా రేషన్‌కార్డులు అందిస్తారని దరఖాస్తు చేసుకున్న వారు సంవత్సరం నుండి ఎంతో ఆశతో ఎదురు చూస్తున్నారు. తహశీల్దార్ కార్యాలయాల చుట్టూ కాళ్లరిగేలా తిరుగుతున్నా సరైన సమాధానం చెప్పేవారు లేకుండా పోయారు. వృద్ధాప్య పెన్షన్లు మంజూరు అవుతాయని ఆశతో వున్న వారిలో కొందరు మరణించారు కూడా.

మొత్తం మీద రచ్చబండ కార్యక్రమం అధికారులకు సవాల్‌గా మారనుంది. ప్రభుత్వం నుంచి నిర్ణీత సమయంలో నిధులు విడుదల కాకపోవడంతో కొత్తగా పెన్షన్లు అందించలేక పోతున్నామని అధికారులు వాపోతున్నారు.



# నక్సల్స్ సమస్య పెద్ద సమస్య కాదు!



తెలంగాణ ఏర్పాటువల్ల తలెత్తే ప్రధాన సమస్య నక్సల్స్ ప్రాబల్యాన్ని కేంద్ర హోం శాఖ నివేదించింది. ప్రధాన మంత్రి మన్మోహన్‌సింగ్ కూడా పదే పదే ఈ అంశాన్ని ప్రస్తావించారు. భారత దేశం ఎదుర్కొంటున్న అత్యంత తీవ్రమైన అంతర్గత భద్రతా ప్రమాదం నక్సల్స్ ఉద్యమం అన్నది ఆయన భావన. తెలంగాణ ఏర్పాటు వల్ల నక్సల్స్ అదుపు తప్పుతారని భావించడానికి కారణాలు మూడు. మొదటిది – చత్తీస్‌ఘడ్ సరిహద్దు. చంద్రబాబు నాయుడు, వైఎస్ రాజశేఖర్‌రెడ్డి అనుసరించిన కఠిన వైఖరి వల్ల ఉత్తర తెలంగాణ నుంచి నక్సలైట్లు చత్తీస్‌ఘడ్‌కు వలస వెళ్లారు. ఆ రాష్ట్రంలో సగం భాగాన్ని తమ స్వాధీనంలో వుంచుకోగల్గుతున్నారు. కేంద్ర సైనిక బలగాలు, వాయుసేన హెలికాప్టర్ల వేట కూడా వారిని అదుపు చేయలేకపోతున్నాయి. చత్తీస్‌ఘడ్‌లోని దంతేవాడ, బస్తర్, మహారాష్ట్రకు చెందిన గచ్చిరోలి జిల్లాలలో నక్సల్స్ తమ పాలన నడిపిస్తున్నారు. పన్నులు దండేది కూడా వారే. తెలంగాణలోని వరంగల్, ఖమ్మం, కరీంనగర్ జిల్లాలకు బస్తర్ సరిహద్దు. అందువల్ల ఏ మాత్రం అవకాశం దొరికినా వారు తెలంగాణలోకి మళ్లే ప్రవేశిస్తారనే వాదన ప్రచారంలో వుంది.

రెండవ కారణం – రాజకీయ అనిస్థితి. సాధారణంగా చిన్న రాష్ట్రాలలో రాజకీయ స్థిరత్వం వుండదు. ప్రభుత్వాలు బలహీనంగా వుంటాయి. దానితో ఎమ్మెల్యేలు, ఇతర ప్రజా ప్రతినిధులు తమ ఉనికి కోసం నక్సల్స్‌ను ఆశ్రయిస్తున్నారు. వారికి తమ సహాయం అందిస్తున్నారు. తెలంగాణలో కూడా అదే పునరావృతమౌతుందని ఒక అభిప్రాయం. జార్ఖండ్‌లో జరుగుతున్నది ఇదే.

మూడవది చిన్న రాష్ట్రాలలో పోలీసు వ్యవస్థ బలహీనంగా వుంటుందన్నది. నక్సల్స్‌ను నియంత్రించడానికి అవసరమైన గ్రేహౌండ్స్ వంటి ప్రత్యేక దళాలను నిర్వహించే ఆర్థిక స్థోమత వుండదు కాబట్టి, సాధారణ పోలీసులను నక్సల్స్ సులభంగా అధిగమిస్తారనేది వాదన.

అయితే ఈ మూడు వాదనలలో పెద్దగా నిజం లేదు. నక్సల్స్ ఉద్యమం ఇప్పుడు మన దేశంలోని 83 జిల్లాలలో పాతుకొని వుంది. అందులో బీహార్, మహారాష్ట్ర, కర్నాటక, ఆంధ్రప్రదేశ్ వంటి పెద్ద రాష్ట్రాలూ కలసి వున్నాయి. ఒక్క ఆంధ్రప్రదేశ్‌లో మాత్రమే నక్సల్స్ ప్రభావం దాదాపుగా అంతరించిపోయింది. అందుకు కారణాలు రెండు.

## పల్లెలలో అభివృద్ధి

శ్రీరాం సాగర్ నీటి వసతి వల్ల బీడు భూములు మాగాణులుగా రూపాంతరం చెందడం; రాష్ట్ర ప్రభుత్వం చేపట్టిన వివిధ అభివృద్ధి పథకాలు సత్ఫలితాలు ఇవ్వడం వల్ల తెలంగాణ జిల్లాలలో ప్రజల జీవన ప్రమాణాలు మెరుగుపడ్డాయి. దానితో పల్లె జనం కూడా చదువుకు ప్రాధాన్యత ఇస్తున్నారు. కొద్దిపాటి చదువుతో కూడా హైదరాబాద్‌లోని కాల్ సెంటర్లు, మార్కెటింగ్ కంపెనీలు, ఐసిఐసిఐ బ్యాంక్ వంటి ఆర్థిక సంస్థలు ఉద్యోగాలు ఇస్తున్నాయి. పెద్ద సంఖ్యలో యువతీ యువకులు ఉద్యోగాల కోసం హైదరాబాద్‌కు వలస వెళ్లిపోతున్నారు. దానితో నక్సల్స్‌కు కార్యకర్తలు దొరకడం కష్టమైపోయింది.

## ఇంటెలిజెన్స్ వ్యవస్థ

మాజీ డిజిపి అరవిందరావు నక్సల్స్ నిర్మూలనకు ఆధునిక సాంకేతిక పరిజ్ఞానాన్ని అద్భుతంగా వినియోగించాడు. లకడికాపూల్‌లోని ఇంటెలిజెన్స్ కార్యాలయంలో అమెరికాకు ధీటైన సాంకేతిక వ్యవస్థ వుంది. నక్సల్స్ వాడే సెల్‌ఫోన్లు, ఇంటర్నెట్ కేంద్రాలను గుర్తించి, వారి ఆనుపానులు కనిపెట్టి మట్టుబెట్టడంలో అరవిందరావు మెచ్చుకోదగిన విజయం సాధించాడు. నల్లమల అడవులలో నక్సల్స్ ఏ చెట్టు క్రింద నిలబడి వున్నదీ గూగుల్ మ్యాప్ ద్వారా గుర్తించి, గుట్టుచప్పుడు కాకుండా పోలీసు దళాలను పంపేవాడాయన. ఉత్తర తెలంగాణ జిల్లాలలో విస్తృతమైన ఇంటెలిజెన్స్ వ్యవస్థను ఏర్పాటు చేశాడు.

ఒకప్పుడు నక్సల్స్‌కు పల్లె జనం తమ ప్రాణాలను పణంగా పెట్టి మరీ ఆశ్రయం కల్పించేవారు. పోలీసు కదలికలను వారికి ముందుగానే అందజేసేవారు. కానీ ఇప్పుడు పరిస్థితి తారుమారైపోయింది. ఏ నక్సలైట్ నేత అయినా వూళ్లోకి వస్తే, ఆ వూళ్లోని వారే నిశ్శబ్ధంగా సెల్‌ఫోన్ల ద్వారా పోలీసుకు సమాచారం ఇచ్చేస్తున్నారు. దానితో నక్సల్స్ గ్రామాలలోకి రావడానికే భయపడిపోతున్నారు. అటు పల్లెలలోని పేద ప్రజలు, ఇటు పట్టణాలలోని మధ్యతరగతి మేధావి వర్గాలు రెండూ నక్సల్స్‌కు దూరంగా జరిగిపోయాయి.

ఈ రోజుకి ఈ రోజు పరిస్థితి చూస్తే ఉత్తర తెలంగాణలో నక్సల్స్ ఉనికే లేదు. వారు మళ్లీ ఈ ప్రాంతాలకు వచ్చి స్థిరపడే సామాజిక, ఆర్థిక పరిస్థితులు లేవు.

తెలంగాణాను జార్ఖండ్ వంటి చిన్న రాష్ట్రాలతో పోల్చడం పొరపాటు. అక్కడకు, ఇక్కడకు రాజకీయంగా, సామాజికంగా ఎంతో తేడా వుంది. తెలంగాణ రాజకీయవాదులు పరిణితి చెందిన మేధావులు. ప్రజల జీవన ప్రమాణాలు చాలా జాస్తి. తెలంగాణ జిల్లాలలో చేపట్టిన నీటిపారుదల ప్రాజెక్ట్‌లు రానున్న రోజులలో గ్రామీణ ఆర్థిక వ్యవస్థ తీరు తెన్నులను మార్చివేయడం ఖాయం. పేరుకు చిన్న రాష్ట్రమే అయినా తెలంగాణ జనాభా దాదాపు 3 కోట్లు. నార్వే, ఫిన్‌ల్యాండ్, స్విట్జర్లాండ్, డెన్మార్క్, నెదర్‌ల్యాండ్స్, బెల్జియం, గ్రీస్, పోల్యాండ్ వంటి ఎన్నో ఐరోపా దేశాల జనాభా కంటే ఎక్కువ. అంతర్జాతీయ స్థాయి నగరమైన హైదరాబాద్ ఇక నుంచి తెలంగాణలో అంతర్భాగం. వీటన్నిటి దృష్ట్యా ఆ కొత్త రాష్ట్రం రాజకీయ బలహీనతను ఎదుర్కొంటుందన్నది సరైన అంచనా కాదు.

తెలంగాణ అడ్డుకోవడానికి కొందరు మేధావులు, పోలీసు అధికారులు చూపిన భూతమే – నక్సల్స్ సమస్య. దాన్ని పరిష్కరించుకోలేని అవివేకులు కారు తెలంగాణవాసులు.

## రాజధాని ఎక్కడ?

రాష్ట్ర విభజన సమయంలో నీళ్లు, విద్యుత్, ఉపాధి వంటి అంశాల కంటే అధికంగా చిక్కుముడి పడే అంశం – కొత్త రాజధాని ఎక్కడ అనేది. ఆంధ్రులు పదేళ్ల లోపల కొత్త రాజధాని కట్టుకొని హైదరాబాద్ వదలి పోవాలని నిర్ణయించింది కేంద్రం. కొత్త రాజధాని అంటే సెక్రటరియేట్, అసెంబ్లీ, హైకోర్టు, వివిధ ప్రభుత్వ డైరెక్టరేట్లు, విద్యా సంస్థలు, ఉద్యోగులకు ఇళ్లు, ఆస్పత్రులు, విమానాశ్రయం, రైల్వే వ్యవస్థ, బస్ స్టాండ్ వంటి నిర్మాణాలన్నీ జరగాలి. వాటితో పాటుగా ప్రజల నివాసానికి కావలసిన హంగులన్నీ అమరాలి. కొత్త మాళ్లు, సినిమా హాళ్లు, షాపింగ్ సముదాయాలు, స్కూళ్లు, పార్కులు తదితర వసతులన్నీ ఏర్పరచాలి. ఉన్న నగరాలలో ఏదో ఒక దాన్ని ఎంచుకొంటే కొంతవరకు ఖర్చు మిగులుతుంది. ఆ నగరం ఏది అన్నదే పెద్ద పెద్ద సమస్య. 1953లో ఆంధ్ర ఏర్పడినప్పుడు కర్నూలు రాజధానిగా నిర్ణయించారు కాబట్టి, ఇప్పుడు దాన్నే ఎంపిక చేయాలని రాయలసీమ వాసులు కోరుతున్నారు. అయితే భౌగోళికంగా, రవాణా వసతుల దృష్ట్యా కర్నూలు ఎవరికీ సౌకర్యం కాదు. కొత్త రాష్ట్రం ఆగ్నేయ మూల తెలంగాణ ఆనుకొని వుంటుందది. శ్రీకాకుళం విశాఖపట్నం వంటి దూర ప్రాంతాల వారికి రవాణా వసతి కూడా కష్టం.

హైదరాబాద్ తర్వాత పెద్ద పట్టణాలుగా వున్న విశాఖపట్నం, విజయవాడలలో ఒక దాన్ని ఎంపిక చేయాలన్న వాదన వుంది. కర్నూలు విశాఖకు ఎంత దూరమో, విశాఖకు కర్నూలుకు అంతే దూరం. అందువల్ల కుదరదు. విజయవాడ చాలా ఖరీదైన ప్రాంతం. అక్కడ భూమి లభ్యత చాలా తక్కువ. కాబట్టి కొత్త రాజధాని నిర్మాణ ఖర్చు భరించరాని రీతిలో వుంటుంది. ప్రముఖ పుణ్య

కొరవ 14వ పేజీలో

# భావోద్వేగమే సమస్య!

అసలు తెలంగాణ వాసులు ప్రత్యేక రాష్ట్రం ఎందుకు కోరారు, మనం ఎందుకు వద్దంటున్నాము అన్నది ప్రశ్న. వెనుకబాటు తనం అనేది తెలంగాణ ఉద్యమకారులు చూపే ప్రధాన కారణం. కానీ అదొక్కటే నిజం కాదు. శ్రీరాంసాగర్ పుణ్యమా అని తెలంగాణలో కూడా వ్యవసాయకంగా ఎంతో అభివృద్ధి జరిగింది. ఈ రోజు రాష్ట్రంలో అత్యధిక వరి ఉత్పత్తి జరిగేది పశ్చిమగోదావరి జిల్లాలలో కాదు, కరీంనగర్‌లో. పారిశ్రామికంగా హైదరాబాద్ అభివృద్ధి సమస్తం తెలంగాణ స్వంతం. విద్య, వైద్యం వంటి వసతుల విషయంలోను తెలంగాణ మన కంటే మెరుగు. ఒక్క హైదరాబాద్ నగరంలోనే ఎన్నో విశ్వవిద్యాలయాలున్నాయి. కేంద్ర నియంత్రణలోని పరిశోధనాలయాలున్నాయి. అయినా సరే, తెలంగాణ ప్రజలు తమకంటూ ఒక రాష్ట్రం కావాలని కోరుకొన్నారు. అరవై ఏళ్లుగా ఆ అభిలాష సజీవంగా వుండిపోయింది. ఆంధ్రలో విలీనమయ్యే నాటికి మనకంటే తెలంగాణ ఆర్థికంగా మెరుగైన స్థితిలో వుంది. వారిది మిగులు బడ్జెట్.

ఒక భాష మాట్లాడేవారు ఒకే రాష్ట్రంలో వుండాలనేది సిద్ధాంతం. అందువల్లనే మద్రాసు నుంచి మనం విడిపోయాము, తెలంగాణతో కలిశాము. అయితే సామాజిక జీవనానికి భాష ఒక్కటే ప్రాతిపదిక కాదు. అట్లయితే మధ్యప్రదేశ్, ఉత్తరప్రదేశ్, బీహార్, జార్ఖండ్, చత్తీస్‌ఘడ్, గుజరాత్, రాజస్థాన్, కాశ్మీర్, హిమాచల్‌ప్రదేశ్, హర్యానా వంటి రాష్ట్రాలన్నిటినీ కలిపి ఒకే రాష్ట్రం చేయాలి. వారందరూ మాట్లాడేది హిందీ. భాష కంటే అధికంగా సంస్కృతి, సాంప్రదాయాలు మానవ జీవితాన్ని ప్రభావితం చేస్తాయి. ఆ కోణంలో చూసినప్పుడు తెలంగాణ, ఆంధ్ర ప్రజలు మాట్లాడేది తెలుగు భాష అయినా, వారి ఆచారాలు, పండుగలు, కటుంబ పద్ధతులు, సాంఘిక కట్టుబాట్లు వంటివన్నీ భిన్నంగా వుంటాయి. అందువల్లనే అరవై ఏళ్ల సహజీవనం తర్వాత కూడా భావోద్వేగాల పరంగా రెండు ప్రాంతాల మధ్య సఖ్యత కుదరలేదు.

హిందీ మాట్లాడే రాష్ట్రాలు ఒకటికి పది వున్నప్పుడు తెలుగు మాట్లాడే రాష్ట్రాలు రెండు వుంటే వచ్చే నష్టం ఏమీ లేదు. నిజానికి ఒరిస్సా, కర్నాటకలోని చాలా జిల్లాలలో తెలుగు ప్రధాన భాష. అయినావారు పరాయి రాష్ట్రాలలో సుఖంగా బ్రతకగలుగుతున్నారు. సమైక్యాంధ్ర అంటే ఆ రాష్ట్రాలకు చెందిన జిల్లాలను కూడా మనం కలుపుకోవాలి. అది జరిగే పని కానప్పుడు సమైక్యాంధ్ర అనేది అసంబద్ధమైన నినాదం. దానికి ఔచిత్యం లేదు.

ఆంధ్రలో కలవడం తెలంగాణ ప్రజలకు ఏనాడూ ఇష్టం లేదు. 1953లో మనం మద్రాసు నుంచి విడివడినప్పుడు వారిది ప్రత్యేక రాష్ట్రం. భాషా ప్రయుక్త రాష్ట్రాల సిద్ధాంతాన్ని అమలులో

కొరవ 14వ పేజీలో

# వారఫలాలు

*తేది 03-8-2013 నుండి 09-8-2013 వరకు మేషంలో కేతువు; మిథునంలో కుజ, గురులు, బుధుడు 5వ తేదీవరకు తదుపరి రవితో కర్కాటంలో; సింహంలో శుక్రుడు; తులలో శని, రాహువులు; మిథున, కర్కాటక, సింహాలలో చంద్రుడు సంచరిస్తారు.*




ఈవారం గ్రహబలం బాగుంది. యత్నీకృత కార్యలాభాలు, ఆదాయం నిలువజేయాలనే కోరిక, వృత్తి, వ్యాపార, ఉద్యోగులకు ఒత్తిడి పెరుగుట, తొందరతో కూడిన పనులు చేపట్టేందుకు వీలు కలదు. నూతన గృహ నిర్మాణాలు లేదా ఇంటి రిపేర్లు వంటి కార్యాలు చేపట్టగలరు. నిరుద్యోగులకు అవివాహితులకు శుభాలుంటాయి. భార్యాభర్తల మధ్య సమస్యలు సమసిపోతాయి.




ద్వితీయార్ధాన గ్రహానుకూలతలు తగ్గుతాయి. పట్టుదలలు కలిగి, ఇతరుల విషయాలకు దూరంగా వుండాలి. తర్వాత స్థిరనిర్ణయాలతో యత్నించుకోవాలి. శుభకార్యాలకు ఖర్చు ఎక్కువ చేస్తారు. దంపతుల మధ్య అవగాహనా లోపం, వాగ్వివాదాలుంటాయి. నూతన వస్తు, వాహన ప్రాప్తి. ఆరోగ్య లాభం, కుటుంబ సౌఖ్యం, దూర ప్రయాణాలు లాభిస్తాయి. గృహ నిర్మాణాలు చేపట్టగలరు.




వృత్తి, వ్యాపార, ఉద్యోగాలలో ఆదాయాలు పర్వాలేదనిపిస్తాయి. కొన్ని ముఖ్య పనులకు కుటుంబ వ్యక్తుల సహకారాలు అవసరం. వివాహాది శుభకార్యాలు, శంఖుస్థాపనాది గృహ కార్యాలు చేపట్టగలరు. వ్యక్తిగత విషయాలలో పలు జాగ్రత్తలవసరం. గత కొంత కాలంగా పడుతున్న బాధల నుండి ఉపశమనం. వృత్తి, వ్యాపారాలలో సౌకర్యం మరియు స్పెక్యులేషన్‌లో అనుకూలతలు.




ప్రతికూలతలున్నప్పటికీ అనుకూలతలకు ప్రయత్నిస్తారు. సమర్థవంతమైన యోచనలు చేస్తారు. స్థిరాస్తులు కాపాడుకొనే ప్రయత్నం తీవ్రం చేస్తారు. వారమంతా ఖాళీ లేకుండానే రోజులు గడిచిపోతాయి. నమ్మినవారికి మీరు నష్టపోయినా సహకరిస్తారు. వృత్తి, వ్యాపార, ఉద్యోగాలలోనివారు కర్తవ్యపాలనకు ప్రాధాన్యతనిస్తారు. కుటుంబ వ్యక్తుల మధ్య అవగాహనతో సంతోషంగా వుంటారు.




గ్రహానుకూలత వల్ల ఇంట్లో తలపెట్టిన శుభకార్య ప్రయత్నాలకు అనుకూలతలేర్పడతాయి. నూతన వ్యాపారానుకూలతలు సాధిస్తారు. శుభకార్యాల నిమిత్తం ఖర్చులధికం. రక్తసంబంధీకుల నుండి దుర్వార్తలు వినుట, వృత్తి, వ్యాపారాలకు ప్రభుత్వం నుండి ఒత్తిడి, ఆరోగ్య లాభం, బంధుమిత్రుల కలయిక, శత్రువులపై విజయం వుంటుంది. నూతన పరిచయాలు లాభిస్తాయి.




చేసే పనులు వాయిదాపడుట లేదా విమర్శలు ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ఎదుర్కోగలరు. చేపట్టిన పనులు పూర్తి చేస్తారు. ఆదాయానికి మించిన ఖర్చులుంటాయి. వివాహాది శుభకార్యాలలో పాల్గొంటారు. విదేశీయానం తలపెట్టిన వారికి, వివాహితుల, నిరుద్యోగుల మనోభీష్టం ఫలిస్తుంది. ప్రభుత్వాధికారులతో తగు జాగ్రత్తలవసరం. అవసరానికి రుణం చేయవలసి వస్తుంది.

## పంచాంగం

| | |
|---|---|
| 5తేది | షబే ఖదర్. |
| 6తేది | భౌమ్య అమావాస్య, చౌడేశ్వరి జయంతి. |
| 9తేది | రంజాన్ పండుగ (ఈద్-ఉల్-ఫితర్). షవ్వాల్ నెల ప్రారంభం. మధుస్రవా వ్రతం. |
| 10తేది | నాగ చతుర్థి (మధ్యాహ్నిక వ్యాప్తి) దుర్వా గణపతి వ్రతం. |

**శుభ ముహూర్తాలు**

8, 10తేదీలలో వివాహ, కేశఖండన, సీమంత, నిశ్చితార్థ, అన్నప్రాసన, దేవతా ప్రతిష్టలు, గృహప్రవేశాలకు ముహూర్తాలున్నాయి.

**ఆగష్టు తిథులు**

**ఆషాడ బహుళ**

| | | | | |
|---|---|---|---|---|
| 3 | శని | ద్వాదశి | రా | 09.02 గం.ల.వ |
| 4 | ఆది | త్రయోదశి | రా | 11.24 గం.ల.వ |
| 5 | సోమ | చతుర్దశి | రా | 01.32 గం.ల.వ |
| 6 | మంగళ | అమావాస్య | రా | 03.19 గం.ల.వ |

**శ్రావణ శుద్ధ**

| | | | | |
|---|---|---|---|---|
| 7 | బుధ | పాడ్యమి | తె | 04.45 గం.ల.వ |
| 8 | గురు | విదియ | | పూర్తిగా |
| 9 | శుక్ర | విదియ | ఉ | 05.49 గం.ల.వ |

**అక్కరాజు బాలసుబ్రహ్మణ్యం**
7/34, దొడ్ల సుబ్బారెడ్డి నగర్, నవలాకులతోట, నెల్లూరు - 2. సెల్: 95819 76599.




ఇంట్లో కొందరికి వివాహ, ఉద్యోగ ప్రయత్నాలు ఒక కొలిక్కి రాగలవు. జీవితం విశ్రాంతిలేక వేగవంతమౌతుంది. క్రమంగా నిరాశ తొలగి ఆశావహ పరిస్థితులు నెలకొంటాయి. చిన్నపాటి నిర్ణయమైనా సంప్రదింపులతో ముందుకెళ్లుట మంచిది. దానధర్మాలకు, ఆధ్యాత్మికతకు ధన, సమయాలు వెచ్చిస్తారు. వృత్తి, వ్యాపార, ఉద్యోగానుకూలతలు సాధిస్తారు. ఆర్థిక సమస్యలు నెమ్మదిగా తీరుతాయి.




గతవారం కన్నా మేలనిపించి కొంత పూరట కల్గిస్తుంది. ఆర్థిక లావాదేవీలలో సంతృప్తి లభిస్తుంది. వ్యవహారాలు ముందుకు సాగుతాయి. ప్రశాంత జీవనం, సంతాన సౌఖ్యం, భార్యాభర్తల అన్యోన్యత, సంఘంలో ఔన్నత్యం, శత్రు జయం వుంటుంది. అయితే కొన్ని విషయాలలో క్రమశిక్షణ పాటించుట అవసరం. ప్రతిరోజూ శివాలయ సందర్శన, నవగ్రహ పారాయణ చేయడం మంచిది.




గ్రహాల అననుకూలత వల్ల స్వల్పంగా ఈతిబాధలు, ఏ పని చేయబుద్ధి కాదు. మనోదుఃఖం, ప్రతి విషయంలో అసంతృప్తి. బంధుమిత్రుల విరోధాలు, వాహన ప్రమాదాలు, స్పెక్యులేషన్ ప్రతికూలతలు, గృహంలో అశాంతి, ప్రయాణాలందు ఇక్కట్లు, పెద్దలతో కలహాలు, ఆర్థిక నష్టాలు, అలసట, స్థానమార్పులు, హాస్పిటల్ సందర్శన, మనోవ్యాకులతలుంటాయి.




ఈ వారం యత్నపూర్వక కార్యలాభం, మంచి అనుకూలతలు సాధిస్తారు. ఖర్చులకు తగిన ఆదాయముండి, ఆత్మీయుల అండదండలుంటాయి. దీర్ఘరోగగ్రస్థులకు ఆరోగ్య విషయంలో జాగ్రత్తలవసరం. ఔషధ సేవలుంటాయి. వీరి మనోధైర్యానికి ఆధ్యాత్మికత ఉపకరిస్తుంది. ఇంట్లో చేసే శుభకార్య యత్నాలు ఫలిస్తాయి. ఇతరులను విమర్శించుట తగ్గించండి. అన్ని రంగాల వారికి ఆర్థిక పుష్టి.




శుభాశుభ మిశ్రమంగా వుండి, అన్ని రంగాల వారూ అన్ని విషయాలలో అనుకూలతలు సాధిస్తారు. వృత్తి, ఉద్యోగాలలో అధికాదాయం, గృహమార్పులు వుంటాయి. అధికార మెప్పుకై ప్రయత్నాలు మాని, కర్తవ్యాలకై ప్రయత్నించుట మేలు. స్త్రీ విరోధం, భార్యకు ఆరోగ్య భంగం, భయాందోళనలు కలిగే సంఘటనలు, నమ్మిన వారి నుండి మోసపోవుట, సంతానం ద్వారా సమస్యలు వుంటాయి.




మిశ్రమ ఫలితాలుంటాయి. తలపెట్టిన పనులలో కొన్నింటిలో విజయం సాధించినా, మరికొన్నింటిలో నష్టం రావచ్చు. ఆరోగ్య, ఆదాయాలు పర్వాలేదు. గతంలో రావలసిన బాకీలు వస్తాయి. బంధుమిత్రుల కలయికతో దైవ సందర్శన, వాహన మార్పు, దైవ సంబంధ కార్యాలు చేయుట, ఆదాయానికన్నా ఖర్చులధికమన్నట్లుగా వుంటుంది. శత్రుసంబంధ కార్యాలు చేస్తారు. స్త్రీ విరోధం.

# 'వృక్షం వినా' మనిషికి మనుగడ లేదన్న మహర్షులు!

## వాస్తు సందేహాలు సమాధానాలు

**ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి**
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

*కె.ఎన్.రెడ్డి — బెంగుళూరు*

*★ వృక్ష దేవత, వన దేవత అని వాస్తు సంహితలో ఒక సూక్తం వుందని విన్నాను నిజమేనా?*

విశ్వామిత్ర సంహిత, నాలుగవ అధ్యాయం, ఎనిమిదవ ప్రకరణంలో 'వృక్షం వినా' మనిషికి మనుగడలేదని మహర్షి ఖరాఖండిగా చెప్పాడు. వృక్ష వేధ ఎనిమిది రూపాల్లో మనిషిని పీడిస్తుందని, వాటి వివరాలు కూడా చెప్పాడాయన.

*టి.ఎన్.ఆచారి — సికింద్రాబాద్*

*★ పిశాచవేధ నిజమేనా?*

విశ్వామిత్ర సంహిత ఇందుకు ఉదాహరణలు కూడా చాలా చూపించింది. నాకు తెలిసిన కొన్ని గృహాలలో కూడా ఈ విషయమై కొన్ని సంఘటనలు జరిగాయి. నరఘోష యంత్రం కొంతవరకూ ఈ సమస్యను పరిష్కరిస్తున్నది.

*డి.లక్ష్మీకాంతమ్మ — అనంతపురం*

*★ అమ్మాయి వివాహం ఆలస్యమవుతున్నది?*

గృహవాస్తు దోషాలు, జ్యోతిష శాస్త్ర అననుకూల గ్రహదోషాలు. నివృత్తి చేసుకోవడం ఆలస్యమయ్యే పక్షంలో వెంటనే యంత్ర ప్రతిష్ట మంచి పరిష్కారం.

*కె.వి.రెడ్డి — బెంగుళూరు*

*★ అపార్టుమెంటులో వాస్తు సమస్యలు ఎక్కువంటారు ఎందువల్ల?*

అపార్టుమెంటులో బాహ్య, అంతర దోషాల్ని సరిచేసి నిర్మాణాలు చేయరు. అందువల్ల బయటి, లోపలి వాస్తు దోషాలు గృహస్తుల్ని ఉక్కిరి బిక్కిరి చేస్తాయి.

*టి.మల్లీశ్వరి — కడప*

*★ రాహుకాలంలో ముహూర్తాలు ఎందుకు పెడతారు?*

శుభముహూర్తాలలో రాహుకాలం పాటింపు లేదు. అమృత ఘడియలకు ఏ అడ్డూ వుండదు.

*వై.సుచరిత — నెల్లూరు*

*★ బాలికా హంతకులు పూర్వం కూడా వున్నారా?*

సమాజంలో స్త్రీ, పురుష వివక్ష పూర్వం నుంచీ వుంది. అందువల్ల బాలికా శిశు హత్యలు జరిగేవి. అయితే మాండవ్యుడి ఉవాచ వినండి. "శక్తి స్వరూపిణులైన బాలికా శిశు హంతకులే మహిష రాక్షసులు". వారిని శక్తి మహిషాసురమర్దినియై అవతరించి పరిమారుస్తూ వుంటుంది.

*ఎం.ప్రమీల — హైదరాబాద్*

*★ భూగోళం ఉనికి గురించి చెప్పండి?*

ఇరవై ఎనిమిది వాస్తు శాస్త్రాలు ఇలా చెప్పాయి. సమస్త భూమికి మానవుడే అపకారం చేయగలడు. కాలుష్యాన్ని పెంచి తన కూర్చున్న కొమ్మను తానే నరుక్కొంటాడు. వృక్షాలు నశిస్తే పది, పదిహేను సంవత్సరాలలో సమస్త మానవ కోటి నశిస్తుంది. ఇదే ప్రళయమని వారి భావన.

*పి.వి.ఆర్ — కోట*

*★ అత్తగారిది అవసానస్థితి. ఆమెనే గదిలో వుంచాలి?*

భర్త యజమాని! జీవించి వున్నప్పుడు నైరుతి మాస్టర్ బెడ్‌రూం నుంచి వారిని విడదీసి ఆ పాపం మూటగట్టుకోకండి. ఆమె నైరుతి గదిలోనే ఉండటం శాస్త్ర సమ్మతం.

*కె.పెంచలయ్య — పొదలకూరు*

*★ గ్రామ నిర్మాణ లోపాల వల్ల పల్లెలు ఖాళీ అవుతున్నాయా?*

సాంఘిక, ఆర్థిక పరిస్థితులతోబాటు గ్రామ నిర్మాణ లోపాలు కూడా చాలా గ్రామాల్లో చూశాను. వాస్తు లోపాలులేని కొన్ని గ్రామాలు ఇప్పటికీ సుభిక్షంగా వుండటాన్ని మనం చూస్తూనే వున్నాం.

*పి.కాంతారావు — తడ*

*★ 'యంత్ర ప్రతిష్ట' విషయంలో మీరంత ఖచ్చితంగా ఎలా చెప్పగలుగుతున్నారు?*

యంత్రాలలోని లిఖిత బీజాక్షరాల శక్తి నాకు తెలుసు. ప్రతిష్టించిన వారి అనుభవాలు వింటున్నాను. కనుక అలా చెప్పగలుగుతున్నాను.

*కె.వి.ఆర్ — విజయవాడ*

*★ నేను జీవిస్తాననే నమ్మకం లేదు. మీరేదైనా సలహా యివ్వగలరా?*

యాభై పడిలో ఇలా మాట్లాడకండి. డెబ్బై తొమ్మిది సంవత్సరాల ఆయుఃప్రమాణం మీది. మీరు బ్రతుకుతారు. ధైర్యంగా, సంతోషంగా వుండండి. నిర్ణీత యంత్ర ప్రతిష్ట చేసుకుని భయాల్ని వదలి పెట్టండి.

# ఐసిడిఎస్ సూపర్‌వైజర్ల పోస్టులకు యమ డిమాండ్!

**నెల్లూరు, ప్రకాశం జిల్లాల పరిధిలోని ఐసిడిఎస్ ప్రాజెక్టుల్లో ఖాళీగా వున్న 302 సూపర్‌వైజర్ల పోస్టుల భర్తీకి స్త్రీ, శిశు సంక్షేమ శాఖ నోటిఫికేషన్ విడుదల చేసింది. ఇవి రెగ్యులర్ నియామకాలు కావడం వల్ల వీటిని పొందేందుకు పలువురు అక్రమమార్గాల వైపు అడుగులు వేస్తున్నారు.**

సమగ్ర శిశు అభివృద్ధి సేవాపథకం (ఐసిడిఎస్)లో సూపర్‌వైజర్ల నియామకం కోసం స్త్రీ శిశుసంక్షేమశాఖ నోటిఫికేషన్ జారీ చేసింది. ఈ నెల 4 నుండి 18వ తేది వరకు దరఖాస్తులు స్వీకరించారు. ఇందుకు సంబంధించి ఆగష్టు 4వ తేది ఒంగోలులో రాతపరీక్ష నిర్వహించనున్నారు. 10 సంవత్సరాలుగా అంగన్‌వాడి వర్కర్‌గా సర్వీసు పూర్తిచేసిన వారందరూ సూపర్‌వైజర్ పోస్టులకు దరఖాస్తు చేసుకున్నారు. రాత పరీక్షకు హాజరయ్యేందుకు హాల్ టిక్కెట్లను కూడా పంపిణీ చేశారు. 10 సంవత్సరాల విరామం తర్వాత అంగన్‌వాడి వర్కర్లకు సూపర్‌వైజర్లుగా పదోన్నతి కల్పించేందుకు ఇప్పుడు అవకాశం కల్పిస్తూ ప్రభుత్వం ఉత్వర్వులు జారీ చేసింది. గతంలో చేపట్టిన నియామకాలను కాంట్రాక్టు ప్రాతిపదికన భర్తీ చేయడం జరిగింది. ప్రస్తుతం రెగ్యులర్‌గా నియామకాలు చేపడుతుండడంతో ఈ పోస్టులకు మంచి డిమాండ్ ఏర్పడింది. ఎలాగైనా రాత పరీక్షల్లో నెగ్గి పోస్టులను దక్కించుకునేందుకు అన్ని విధాలుగా ప్రయత్నాలు ప్రారంభించారు.

నెల్లూరు, ప్రకాశం జిల్లాల పరిధిలో ఐసిడిఎస్ ప్రాజెక్టుల్లో దాదాపు 302 సూపర్‌వైజర్ల పోస్టులు ఖాళీగా వున్నాయి. వీటికి రెండు జిల్లాల్లో పనిచేస్తున్న అంగన్‌వాడి వర్కర్లు మూడువేల మంది దరఖాస్తు చేసుకున్నారు. కాంట్రాక్టు ప్రాతిపదికన పని చేస్తున్న సూపర్‌వైజర్లను రెగ్యులర్ చేయాలని అనేక సంవత్సరాల నుంచి డిమాండ్ చేస్తున్నారు. అయితే ప్రభుత్వం స్పందించలేదు. అంగన్‌వాడి వర్కర్లుగా విధులు నిర్వహిస్తున్న వారిని రాతపరీక్ష ద్వారా ఎంపిక చేసి పదోన్నతి కల్పించాలని ప్రభుత్వం నిర్ణయించడంతో కొన్ని జిల్లాలో కాంట్రాక్టు సూపర్‌వైజర్లు హైకోర్టును ఆశ్రయించారు. దీంతో ఆయా జిల్లాలో నోటిఫికేషన్ రద్దు చేస్తూ ఉత్తర్వులు జారీ చేసింది. మిగిలిన జిల్లాల్లో పనిచేస్తున్న వారు కూడా హైకోర్టును ఆశ్రయించే ఆలోచనతో వున్నట్లు తెలిసింది. నెల్లూరు జిల్లాలో కూడా పని చేస్తున్న సూపర్‌వైజర్లు కోర్టును ఆశ్రయిస్తే ఏ క్షణంలోనైనా నోటిఫికేషన్ రద్దు చేయడం గానీ, పరీక్షలను నిలిపివేయడం గాని జరుగవచ్చు.

## నేతల చుట్టూ ప్రదక్షిణలు

రాత పరీక్ష ద్వారా ఎంపికై సూపర్‌వైజర్ పోస్టుకు పదోన్నతి పొందేందుకు అంగన్‌వాడివర్కర్లు కుటుంబసభ్యుల ద్వారా రాజకీయ నేతల చుట్టూ ప్రదక్షిణలు చేయిస్తున్నారు. నిన్నటివరకు గ్రామ పంచాయతీల ఎన్నికల ఏర్పాట్లు, ప్రచారంతో బిజీగా వున్న నేతలు ప్రస్తుతం ఊపిరిపీల్చుకున్నారు. ప్రధానంగా అధికారపార్టీకి చెందిన చోటా నాయకుల ద్వారా ఎమ్మెల్యేలు, మంత్రి వద్దకు సిఫార్సు కోసం వెళతున్నారు. స్త్రీ, శిశు సంక్షేమశాఖ ఆధ్వర్యంలో రాతపరీక్ష, ఇంటర్వ్యూలు వుండడంతో ఎలాగైనా అధికారులపై ఒత్తిడి తెచ్చి పోస్టు ఇప్పించాలని కోరుతున్నట్లు సమాచారం. అవసరమైతే లంచం కూడా ముట్టచెప్పేందుకు సిద్ధంగా వున్నారు. దీనిని అదునుగా భావించిన కొందరు రాజకీయ దళారులు సైతం రంగప్రవేశంచేసి అంగన్‌వాడి వర్కర్లను బుట్టలో వేసుకునేందుకు ముందుకొస్తున్నారు. ఒక్కో పోస్టుకు 50వేల నుండి లక్ష రూపాయల వరకు ధర నిర్ణయిస్తున్నారు.

ఒకే రోజు రాతపరీక్ష నిర్వహించి అదేరోజు ఫలితాలు వెల్లడించి ఎంపిక చేస్తారని ప్రచారం జరుగుతుంది. మరో పది సంవత్సరాలు గడిస్తే కాని ఇటువంటి అవకాశం లభించదని ఆశాఖ ఉద్యోగులు చెబుతున్నారు. అధికారపార్టీ నేతలు తలచుకుంటే ఏదైనా చేస్తారని గట్టిగా నమ్ముతున్నారు. ప్రస్తుతం లభించిన అవకాశం చేజారిపోతే మళ్లీరాదని, ఒకవేళ వచ్చినా వయోపరిమితి మించిపోతుందని నేతలకు విన్నవిస్తున్నారు. గ్రామాల్లో అనేక మంది అంగన్‌వాడి వర్కర్లు పోలింగ్ కేంద్రం స్థాయి అధికారులుగా విధులు నిర్వహిస్తున్నారు. వీరి బలహీనతను ఆసరా చేసుకున్న నేతలు గ్రామ పంచాయతీ ఎన్నికల్లో తాము సూచించిన వారి గెలుపుకు కృషి చేయాలని షరతు పెట్టినట్లు విశ్వసనీయంగా తెలిసింది. నేతలు సూచించిన విధంగానే కొందరు గుట్టుచప్పుడు కాకుండా పరోక్షంగా ప్రచారం చేసినట్లు సమాచారం. పదోన్నతి లభిస్తే హోదాతో పాటు జీతం కూడా పెరుగుతుందన్న ఆశతో లంచం ముట్టచెప్పేందుకు అప్పులు చేసేందుకు సిద్ధపడుతున్నారు అంగన్‌వాడి వర్కర్లు. ఏదిఏమైనా సూపర్‌వైజర్ పోస్టుల పుణ్యమా అంటూ లక్షలాది రూపాయలు చేతులు మారే అవకాశం వుంది.

**అక్రమ త్రవ్వకాలు**

# కావలి డివిజన్‌లో జోరుగా గ్రావెల్, మట్టి త్రవ్వకాలు!

రాజకీయ నేతల సహకారం, అధికారుల ఉదాసీనత వైఖరి కారణంగా కావలి డివిజన్ పరిధిలోని పలు మండలాల్లో గ్రావెల్, మట్టి తరలిపోతోంది. రెవెన్యూ, గనులశాఖల నుంచి ఎటువంటి అనుమతి తీసుకోకుండానే గ్రావెల్, మట్టిని తరలించి లక్షలు గడిస్తున్నారు. ఇష్టానుసారంగా త్రవ్వకాలు జరపడంతో పెద్ద గోతులు ఏర్పడి సమీప గ్రామాల ప్రజలు మృత్యువాత పడుతున్నారు. ప్రభుత్వ ఆదాయానికి గండికొట్టి ఖనిజ సంపదను భారీ వాహనాల ద్వారా రవాణా జరుగుతున్నా అధికారులు చూసీచూడనట్లుగా వ్యవహరిస్తూ పోతున్నారు. కావలి డివిజన్‌లో లైనింగ్ పనులు ముమ్మరంగా జరుగుతున్నాయి. నీటి పారుదలశాఖ ఆధ్వర్యంలో చేపట్టిన ఈ పనులకు గ్రావెల్ అవసరం ఏర్పడింది. దీంతో ఎక్కడ అందుబాటులో గ్రావెల్ లభిస్తుందో అక్కడ నుండి తీసుకుపోతున్నారు.

కావలి డివిజన్‌లోని కావలి, బోగోలు, దగదర్తి, అల్లూరు తదితర మండలాల్లో గ్రావెల్, మట్టి వ్యాపారం జోరుగా సాగుతోంది. కావలి మండలంలోని కావలి పెద్ద చెరువు, కొత్తపల్లి సిరిపురం, చలంచర్ల, బుడుంగుంట, రాజువారి చింతలపాళెం చెరువుల్లో ఇట్టుకబట్టీలు వెలిశాయి. నీటి సంఘాల అధ్యక్షులకు మామూళ్లు అందజేసి జెసిబిల సహాయంతో మట్టిని తరలించుకు వెళుతున్నారు కాంట్రాక్టర్లు. అలాగే తాళ్లపాళెం, రుద్రకోట, మద్దూరుపాడు, ముసునూరు ప్రాంతాల నుంచి గ్రావెల్‌ను తరలిస్తున్నారు. పోలీసులకు పట్టుబడిన వాహనాలను విడిపించుకునేందుకు వేలాది రూపాయలు మామూళ్లు ముట్టచెబుతున్నట్లు తెలిసింది. గ్రామస్తులు గ్రావెల్ త్రవ్వకంపై ప్రశ్నిస్తే అధికారుల నుండి అన్ని అనుమతులు వున్నట్లు నమ్మబలుకుతుంటారు. బోగోలు మండలంలోని బోగోలు చెరువు, కొండ బిట్రగుంట చెరువు, తిప్ప సమీపంలోని ప్రభుత్వ భూముల్లో త్రవ్వకాలు జరుపుతున్నారు.

ఇక్కడ ఒక బృందం ముఠాగా ఏర్పడి గ్రావెల్‌ను విక్రయిస్తున్నారు. తిప్ప ప్రాంతంలో స్థానికుల అనుమతి లేకుండా గ్రావెల్ తీసుకెళ్లడం సాధ్యం లేని పరిస్థితి. అందువల్ల ఇక్కడ వారికి కొంత నగదు ముందుగానే చెల్లించి ఎటువంటి ఇబ్బందులు తలెత్తకుండా చేసుకుంటున్నారు. అల్లూరు మండల పరిధిలోని భట్రకాగొల్లు, గ్రద్దగుంట, నార్తు ఆములూరు, సింగపేట గ్రామాల సమీపంలో గ్రావెల్ లభిస్తుంది. అలాగే దగదర్తి మండలంలోని కాట్రాయపాడు, కౌరుగుంట, ఉలవపాళ్ల, అనంతవరం, కట్టుబడిపాళెం, సున్నపుబట్టి, ఊబిగుంటపాళెం తదితర గ్రామాల్లో గ్రావెల్ త్రవ్వేస్తున్నారు. ఇటీవల కొందరు స్థానికులు గ్రావెల్ త్రవ్వకాలను అడ్డుకోగా కాంట్రాక్టర్లు బెదిరింపులకు పాల్పడినట్లు సమాచారం. కౌరుగుంట గ్రామంలో జెసిబిని ఉపయోగించి త్రవ్విన గుంటలోపడి తల్లీ, కూతుళ్లు మృతి చెందిన విషయం తెలిసిందే. మళ్లీ ఇదే సంఘటన పునరావృతమవుతుందని స్థానికులు ఆందోళన వ్యక్తం చేస్తున్నారు.




## దుస్థితిలో బోగోలు చెరువు

బోగోలు చెరువు దుస్థితికి చేరింది. గత ఎనిమిది సంవత్సరాలుగా ఈ చెరువుకు రింగ్‌బండ్ తప్ప నిర్మాణం జరగలేదు. చెరువు మరమ్మత్తుల కోసం ఇటీవల టెండర్లు పిలిచారు. నీటి పారుదలశాఖ ఇంజనీర్లు చెరువును పరిశీలించి త్వరలో ప్రారంభిస్తామని హామీ కూడా ఇవ్వడం జరిగింది. మార్చిలో పనులు ప్రారంభించి జూలై ఆఖరి నాటికి పూర్తి చేసి నీరు విడుదల చేస్తామని ప్రకటించి వెళ్లారు. అయితే ప్రకటించిన అధికారి టెండర్ దక్కించుకున్న కాంట్రాక్టర్ పత్తా లేకుండా పోయారు. దీంతో చెరువు మరమ్మత్తుల నిర్మాణ పనులు నిలిచిపోయాయి. చెరువును అభివృద్ధి చేయాలని స్థానిక ఎమ్మెల్యే బీద మస్తాన్ రావు చేసిన కృషి ఫలించకుండా పోయింది. ఇప్పటికైనా సంబంధితశాఖ అధికారులు స్పందించి బోగోలు చెరువు మరమ్మతులు చేయించాలని ఇక్కడి రైతులు కోరుతున్నారు.





## అందమంతా చీరలోనే ఉన్నది!

దబాంగ్ చిత్రంతో తెరపైకి అడుగుపెట్టిన సోనాక్షి సిన్హా భారతీయ మహిళను ప్రతిబింబించే దుస్తుల్లో కనిపిస్తుంటుంది. నుదిటిన బొట్టు, ముక్కుపుడక, తళుకులొలికే చీర... ఇలా మన సంస్కృతి, సాంప్రదాయమంతా ఈ అమ్మడిలోనే ఉందా అన్నట్లుగా ముస్తాబవుతుంది. తెరపై మెరుస్తుంటుంది. సోనాక్షి ఇప్పుడు మరోసారి అక్షయ్‌కుమార్‌తో కలసి నటిస్తోంది. రౌడీ రాథోడ్, జోకర్ చిత్రాల్లో నటించిన ఈ జంట 'బాస్'తో మరోసారి అలరించబోతోంది. ఇప్పటివరకు మాడ్రన్ దుస్తులలో కనపడినట్లు లేదే అంటే... జవాబుగా నేను అచ్చమైన భారతీయ యువతిని. నేను చీరలు ధరించలేదంటే అడగాలి కానీ... మోడ్రన్ దుస్తుల గురించి నన్ను అడక్కూడదు. అందమంతా చీరలోనే ఉన్నప్పుడు ఇతరత్రా దుస్తుల గూర్చి ఎందుకు ఆలోచించాలంటుంది.



## షాహిద్‌కు కొత్త ప్రియురాలు!

సినిమాలకంటే ప్రేమ కబుర్లతోనే ఎక్కువగా ప్రాచుర్యం పొందుతుంటాడు షాహిద్‌కపూర్. జబ్ వుయ్ మెట్ చిత్రీకరణ సమయంలో కరీనాకపూర్‌తో పీకల్లోతు ప్రేమలో కూరకపోయాడు. ఈ జంట అప్పట్లో బాలీవుడ్‌ను తెగ ఆకర్షించింది. కొన్నాళ్ల తర్వాత కరీనాతో కటీఫ్ అన్నాడు. ఇక షాహిద్ మరింత చెలరేగి పోయాడు. ప్రియాంకాచోప్రా, విద్యాబాలన్, నర్గీస్ ఫక్రీ ఇలా పలువురు కథానాయికలతో చెట్టాపట్టాలేసుకొని తిరిగాడు. పబ్‌లు, క్లబ్‌లు తిరిగేసొచ్చాడు. ఈ లవర్ బాయ్‌కు ఇప్పుడు కొత్త స్నేహితురాలు దొరికింది. తనతో కలసి 'ఏక్ థి దాయన్' చిత్రంలో నటించిన హ్యూమా ఖురేషితో షాహిద్ ప్రేమాయణాన్ని సాగిస్తున్నాడని సమాచారం. ఇప్పుడు వీరిద్దరూ బాలీవుడ్‌లో హాట్ టాపిక్‌గా మారారు. ఎక్కడ చూసినా ఈ జంటే కనిపిస్తోందట. మరి ఈ భామతోనైనా బంధం అలాగే కొనసాగిస్తాడో లేక మార్చేస్తాడో?



## చేపల కూరతో తరగని అందం!

హీరోయిన్‌గా ప్రయాణం సాగించడం అనుకొన్నంత సులభం కాదు. వయసు పైబడుతున్నా ఆ ఛాయలు కనిపించనివ్వకూడదు. ఎప్పుడూ స్లిమ్‌గానే కనిపించాలి. బాలీవుడ్ హీరోయిన్లలో స్లిమ్‌గా కనిపించే అతి కొద్ది మందిలో అనుష్క శర్మ ఒకరు. ఆమె ఫిట్‌నెస్ రహస్యం అడిగితే సమాధానంగా పలానావి మాత్రమే తీసుకోవాలి అనిలేదు. అన్ని రకాల పదార్థాలను తింటాను. చేపల కూర ఎక్కువగా తింటా. నా ఆరోగ్యం, అందానికి చేపలే కారణమని చెప్పొచ్చు. పండ్లు తింటూ, రోజుకో గుడ్డు తింటూ కూడా అందాన్ని బాగా కాపాడుకోవచ్చు. వ్యాయామాలు అవసరం లేదు. చిరు చెమట పడేలా నడిస్తే చాలంటుంది ఈ సుందరి.



## బ్రూనాకు సల్మాన్ అండ?

బాలీవుడ్‌లో హీరోయిన్ బ్రూనా అబ్దుల్లా అదరగొడుతోంది. సల్మాన్‌ఖాన్ నా గాడ్‌ఫాదర్ అని చెబుతూ అవకాశాల్ని అంది పుచ్చుకొంటోంది. ఇటీవల గ్రాండ్ మస్తీ చిత్రంలో ఓ మసాలా పాత్ర చేసింది. పేరుకు కాలేజి అమ్మాయి పాత్ర అయినా బోలెడన్ని అందాలు ఆరబోసింది. ప్రచార చిత్రాల్లో ఈ అమ్మడు చేసిన సందడి కుర్రకారును తెగ ఆకట్టుకొంటోంది. ఈ ముద్దుగుమ్మ ఇప్పుడు మరో అవకాశం చేజిక్కించుకొంది. సల్మాన్‌ఖాన్ హీరోగా తెరకెక్కుతున్న మెంటల్ చిత్రంలో బ్రూనా ఓ కీలక పాత్ర పోషిస్తోంది. అందులో అమ్మడు సల్మాన్‌ఖాన్‌కు స్నేహితురాలిగా నటిస్తోంది. దీనిపై ఖుషీ ఖుషీగా వున్న బ్రూనా మాట్లాడుతూ సల్మాన్‌కు స్నేహితురాలిగా నటించడం ఓ ఆనందమైతే, ఇప్పటిదాకా నేను చేయని ఓ విభిన్న పాత్ర దక్కడం మరొక ఆనందమంది. నాకు సల్మాన్ సార్ హిందీ పాఠాలు నేర్పాడు. నటనలోనూ ఎన్నో సలహాలిచ్చాడంటుంది.



## ఐటెమ్‌భామగా నర్గీస్‌ఫక్రీ!

బాలీవుడ్‌లో తక్కువ సమయంలో ఎక్కువ పేరు సంపాదించుకున్న తార నర్గీస్‌ఫక్రీ. రణబీర్ కపూర్ సరసన 'రాక్‌స్టార్' అనే చిత్రంలో ఆడిపాడింది. దీంతో ఆమె చేతినిండా చిత్రాలే. ఈ మార్గం బాగుందని భావించిన భామ షాహిద్‌కపూర్, ఇలియానా జంటగా నటిస్తున్న ఫటాపోస్టర్ నిక్లాహీరో సినిమాలో ఐటెమ్ పాటలో నర్తించను గ్రీన్‌సిగ్నల్ ఇచ్చింది. జాన్ అబ్రహాం సరసన 'మద్రాస్ కేఫ్'లో అక్షయ్‌కుమార్ ప్రొడక్షన్‌లో 3 సినిమాల్లో చేయను ఒప్పుకొంది. గతంలో ఆమె పలు వాణిజ్య ప్రకటనలకు అంబాసిడర్‌గా, మోడల్‌గా, కింగ్‌ఫిషర్ క్యాలెండర్ భామగా అలరించింది.



## హన్సిక ఉపవాసం!

పవిత్రమాసం రంజాన్ మొదలయ్యింది. ముస్లిం సోదరులంతా ఉపవాస దీక్షలు చేస్తున్నారు. హీరోయిన్ హన్సిక కూడా ఇప్పుడు ఉపవాసాలు పాటిస్తోంది. హన్సిక ముస్లిం కాదు కదా మరి ఉపవాసాలు ఎందుకంటారా? నిజమే. అయితే ఆమెకు ముస్లిం స్నేహితులు ఎక్కువగా ఉన్నారట. స్కూల్ రోజుల నుంచీ వాళ్లతో మంచి సాన్నిహిత్యం ఉందట. చదువుకొనేటప్పుడు వాళ్లు మధ్యాహ్నం భోజనం తినడం లేదని తనూమానేసేదట. అప్పట్నుంచి అదే అలవాటుగా చేసుకొంది. రంజాన్ మాసం మొదలైందంటే చాలు... పగలంతా అన్నపానీయాలేమీ తీసుకోదట. షూటింగుల్లో పాల్గొన్నా ఆ దీక్షల్ని పాటిస్తుంటుందట. ఈ విషయమై హన్సిక మాట్లాడుతూ ఎన్నో ఏళ్లుగా ఈ మాసంలో స్నేహితులతో కలసి ప్రార్థనలు చేసేదాన్ని. ఉపవాసాలు పాటించేదాన్ని. నాకు రంజాన్ మాసం అంటే చాలా ఇష్టం. వాళ్లతో కలసి పండగ చేసుకునే దాన్ని అని చెప్పుకొచ్చింది.



## సుమంత్‌తో క్లోజ్‌గా...

బోణీ చిత్రంతో తెలుగు తెరపై కనిపించిన కృతి కర్బందా తీన్‌మార్, ఒంగోలు గిత్త, ఓం చిత్రాల్లో నటించింది. హీరో సుమంత్‌తో కలసి ఈమె సన్నిహితంగా మెలుగుతోందనే ప్రచారం సాగుతోంది. ఈ విషయమై ఆమె మాట్లాడుతూ సుమంత్ నా తొలి సహనటుడు. తనతో నాకు మంచి సాన్నిహిత్యం ఉంది. నా కష్టసుఖాలన్నీ తనతో పంచుకొంటుంటాను. చిత్రసీమలో తను నాకు చక్కటి సహకారాన్ని అందిస్తుంటాడు. పవన్ కళ్యాణ్, కళ్యాణ్ రామ్, రామ్... ఇలా మంచి నటులతో కలసి తెరను పంచుకోవడం చక్కటి అనుభవమంటోంది కృతి.

## బాహుబలిని ఆపిన వర్షం

సెట్స్‌పైకి వెళ్లడానికి ముందే రకరకాల ఊహాగానాలతో వార్తల్లో నిలిచిన చిత్రం బాహుబలి. ప్రభాస్ హీరోగా నటిస్తున్న ఈ చిత్రం ఇటీవలే సెట్స్‌పైకి వెళ్లింది. కర్నూలులో యాక్షన్ సన్నివేశాలతో చిత్రీకరణ మొదలు పెట్టారు. ప్రభాస్, ఇతర చిత్ర బృందంపై కొన్ని కీలకమైన పోరాట ఘట్టాల్ని తెరకెక్కించారు. అక్కడ చిత్రీకరణ జరుగుతుండగానే వర్షాలు మొదలయ్యాయి. దీంతో సినిమాకు బ్రేక్ పడింది. మరోప్రక్క దర్శకుడు రాజమౌళి అమెరికా పయనమయ్యారు. అక్కడ కొన్ని కీలకమైన సమావేశాల్లో ఆయన పాల్గొనాల్సి ఉందట. దీంతో హడావుడిగా అమెరికా వెళ్లిపోయారు. ఆయన అమెరికా నుంచి రాగానే మళ్లీ షెడ్యూల్, చిత్రీకరణ మొదలవుతుంది.



## జర్నలిస్ట్‌గా కరీనా!

హీరోయిన్లు గ్లామర్‌డాల్స్‌గానే కనిపించాలి అనే సూత్రాన్ని ప్రక్కన పెట్టేశారు. మన ముద్దుగుమ్మలు. అభినయ ప్రాధాన్యం ఉన్న పాత్రల వైపు మొగ్గుచూపుతున్నారు. కరీనాకపూర్ కూడా అటువంటి పాత్రల్లో బేషుగ్గా రాణిస్తోంది. చమేలీలో కరీనా వేశ్యగా కనిపించి అందరి ప్రశంసలందుకొంది. హీరోయిన్ సినిమా సరిగ్గా ఆడకపోయినా... కరీనా పాత్రకు మంచి మార్కులే పడ్డాయి. ఇప్పుడు సత్యాగ్రహి సినిమా కోసం పాత్రికేయురాలిగా కనిపించనుంది. ప్రకాష్ ఝా దర్శకత్వం వహిస్తున్నారు. కథంతా రాజకీయ నేపథ్యంలో నడుస్తుంది. అమితాబచ్చన్ ఒక కీలకపాత్రలో కనిపించనున్నాడు. షూటింగ్‌లో ఎక్కువభాగం భోపాల్‌లో జరిగింది. పాత్రికేయురాలి పాత్ర పోషించడం ఓ సవాల్. ఇదివరకు మీడియాపై నాకున్న అభిప్రాయాలన్నీ ఈ సినిమా చేస్తున్నప్పుడు పటాపంచలైపోయాయి.

# విభిన్నంగా ఎస్పీ!

**• స్వంత శాఖ నుంచే సంస్కరణలు మొదలు**

నేనేదీ చెప్పను... చేసి చూపిస్తానంటూ జిల్లా ఎస్పీగా బాధ్యతలు చేపట్టిన నాడు రామకృష్ణ చెప్పిన మాటలు. ఆ మాటలను తన పనితీరుతో అక్షర సత్యం చేస్తున్నారు ఎస్పీ. ఎలాంటి పటాటోపాలు, ప్రచార ఆర్భాటాలకు తావు లేకుండా పోలీసు వ్యవస్థను గాడిలో పెట్టేందుకు ప్రయత్నిస్తున్నారు. ఇందులో భాగంగా తన వద్దకు వివిధ సమస్యలపై వచ్చే వారితో మాట్లాడి పరిష్కారం కోసం ఆయా డిఎస్పీలు, సర్కిల్ ఇన్స్‌పెక్టర్లతో, అవసరమైతే నేరుగా స్టేషన్లలోని ఎస్ఐలతో మాట్లాడి తగిన ఆదేశాలు జారీ చేస్తున్నారు. పోలీసు శాఖలో పనిచేసే వాళ్లు తమ వాహనాలపై పోలీస్ అని వ్రాసుకోవడం అధికం. చాలా మంది నెంబర్ ప్లేటు లేకుండా కేవలం పోలీస్ అని వ్రాసి సరిపెట్టేస్తుంటారు. ఎస్పీ ముందు తన శాఖను చక్కదిద్దేదుకు నడుం బిగించినట్లున్నారు. తన కార్యాలయంలో వుండే అలాంటి పోలీస్ స్టిక్కర్ అతికించిన వాహనాలన్నింటికి రెండొందల రూపాయల చొప్పున జరిమానా విధించారు. అధికారిక వాహనాలకు తప్ప మరెవరు పోలీస్ అని వేసుకోకూడదని సూచించారు. అలాగే ఇటీవల నగరంలో జరుగుతున్న వరుస దొంగతనాలు, పోలీసుల పనితీరుపై వస్తున్న విమర్శలపైనా స్పందించిన ఎస్పీ-డిఎస్పీ, సిఐలు, ఎస్ఐలతో సమావేశం నిర్వహించారు. ఆ సందర్భంలో పోలీసుల పనితీరుపై కఠిన వ్యాఖ్యలు చేశారట. దొంగలను పట్టుకోవడం, దొంగతనాలు అరికట్టడం చేతకాకపోతే ప్రక్కకు తప్పుకోండి. విఆర్‌లో వున్న వారిని నియమించుకొంటానని చెప్పాడట. అలాగే గూడూరు డివిజన్‌లో పంచాయతీ ఎన్నికల్లో మద్యం సరఫరాను అరికట్టడంపై అక్కడి ఎస్ఐలతో మాట్లాడగా వారు కఠినంగా వ్యవహరిస్తున్నామని, ఎక్కడా మద్యం సరఫరా జరగడంలేదని చెప్పగా ఎస్పీ ఆగ్రహించాడట. ఇప్పుడు నేనొచ్చి మద్యం పట్టిస్తే నిన్ను సస్పెండ్ చేయమంటావా అని అనడంతో అక్కడి పోలీసులు వణికి పోతున్నారు. వెంకటాచలం ఎస్ఐ పనితీరుపై రూరల్ సిఐతో చర్యలు చేపట్టాలని ఆదేశించగా ఆ సిఐ సర్దిచెప్పే యత్నం చేయబోగా అయితే ముందు మీపై చర్యలు చేపట్టమంటారా అనడంతో ఆ అధికారి నోటమాట రాలేదట. పంచాయతీ ఎన్నికల అనంతరం సిబ్బంది పనితీరును చూసి కఠినంగా వ్యవహరిస్తున్నానని, నా వద్ద అందరి చిట్టీ వుందని ఎస్పీ రామకృష్ణ చెప్పడంతో అవినీతి పోలీసులకు చెమటలు పడుతున్నాయి.


విలక్షణ శైలిలో సాగుతున్న ఎస్పీ రామకృష్ణ.

# నెల్లూరు నేలమట్టం!

**ఇది డిఇఓ రామ'బ్రహ్మం' మాట**

నెల్లూరు నేలమట్టం అవుతుందని ఏనాడో బ్రహ్మంగారు చెప్పిన విషయం చాలా మందికి తెలుసు. ఈ విషయమై తిరిగి తనదైన శైలిలో చెప్పి తాను మువ్వా రామలింగాన్ని కాదని రామబ్రహ్మన్ని' అని చాటుకున్నాడు జిల్లా విద్యాశాఖాధికారి. ఆయన వ్యవహారశైలి భిన్నంగా వుంటుంది. అవినీతి అక్రమాలతో ఆయన్ను సంతోషపెడితే, అలాంటి ఉపాధ్యాయులు, సిబ్బందికి అండదండలు అందిస్తాడు. కాదని ప్రశ్నిస్తే ఎలాంటి నిజాయితీపరులనైనా వేపుకతింటాడు. చాలా సందర్భాలలో ఇది నిరూపితం అయ్యింది. అలాంటి రామలింగం ఈసారి నెల్లూరు జిల్లా భవిష్యత్తులో ఏమవుతుంది, నేలమట్టం అవుతుందా అన్న విషయమై చేసిన ప్రసంగం ఆయనలో దాగి వున్న మరో కోణాన్ని తెలియజెప్పింది. జిల్లాలోని ప్రాథమిక, ప్రాథమికోన్నత పాఠశాలల్లోని సైన్సు టీచర్లకు అవగాహన సదస్సు స్థానిక కస్తూర్బా కళాక్షేత్రంలో ఇటీవల జరిగింది. ఈ కార్యక్రమానికి ముఖ్య అతిథిగా హాజరైన జిల్లా విద్యాశాఖాధికారి రామలింగం పై విధంగా వ్యాఖ్యానించారు. జిల్లాలో థర్మల్ ప్రాజెక్టుల ఏర్పాటుపై ఆందోళన వ్యక్తం చేసిన ఆయన రామగుండంలో ఒక్క థర్మల్ ప్రాజెక్టు వుంటేనే అది అగ్నిగుండంగా మారిందని, అలాంటిది ఇక్కడ తుమ్మలపెంట నుండి షార్ దాకా ఏకంగా 130 థర్మల్ ప్రాజెక్టులు ఏర్పాటు కానున్నాయని అవన్నీ కార్యరూపం దాల్చితే జిల్లా పరిస్థితి ఏంటని ఆందోళన వ్యక్తం చేశారు. ఈ సందర్భంగానే బ్రహ్మంగారు చెప్పిన నెల్లూరు నేలచదరం అన్న మాటలను గుర్తుకు తెచ్చేలా అభినవ బ్రహ్మంగారిలా మారి థర్మల్ ప్రాజెక్టుల ఏర్పాటు, దాని వలన కలిగే దుష్ప్రభావాలను ఏకరవు పెట్టడంతో సదస్సుకు హాజరైన ఉపాధ్యాయులు ఇదేంది డిఇఓ రామలింగం కాస్తా రామబ్రహ్మం'గా మారాడని చెవులు కొరుక్కున్నారు. ఏది చేసినా, ఏమి మాట్లాడినా రామలింగానికే చెల్లు.

# పంచాయితీ ఎన్నికలు పరమ ఘోరంగా జరిగాయి!

**• వెంకయ్యనాయుడు ఆవేదన**

పంచాయతీ ఎన్నికలు జరిగిన తీరుపై బిజెపి జాతీయనేత ముప్పవరపు వెంకయ్యనాయుడు ఆవేదన వ్యక్తం చేశారు. రాష్ట్రవ్యాప్తంగా జరిగిన ఈ ఎన్నికల్లో డబ్బు, మద్యం విచ్చలవిడిగా పంచడంతో ప్రజాస్వామ్యం అపహాస్యం పాలైందన్నారు. ఈ ఎన్నికల వాతావరణం చూస్తుంటే మనసు వికలమై పోతున్నదని, బాధ కల్గుతున్నాదన్నారు. బిజెపి జిల్లా కార్యాలయంలో జరిగిన విలేకరుల సమావేశంలో ఆయన పంచాయతీ ఎన్నికలు, కేంద్ర ప్రభుత్వ తీరుపై తన దైనశైలిలో విమర్శలు గుప్పించారు. పంచాయతీలకు ఎలాంటి రాబడి వుండదని, కనీసం ప్రజల నుంచి పన్నులు వసూలు చేయలేదన్నారు. అలాంటి పంచాయతీ సర్పంచ్ పదవులకు ఎన్నికల్లో 50 లక్షల నుంచి కోటి రూపాయలు ఖర్చు చేయడం ఎందుకని, ఆ ఖర్చు చేసిన డబ్బును తిరిగి రాబట్టుకొనే పనిలో పడి ప్రజలకు ఏమి సేవ చేస్తారని ప్రశ్నించారు. గతంలో తాను ఎమ్మెల్యేగా పోటీచేసినప్పుడు ప్రజలే చందాలు ఇచ్చేవారని గుర్తు చేసుకొన్నారు. ఓటుకు నోటు పేరుతో 500 నుంచి 1000 రూపాయల వరకు ఇచ్చారని ఇది ప్రజాస్వామ్యానికి గొడ్డలి పెట్టన్నారు.


మాట్లాడుతున్న వెంకయ్యనాయుడు.

మద్యాన్ని ఏరులై పారించారన్నారు. ఇందులో ఎన్నికల్లో పోటీచేసే వారిది, ఓటర్లది తప్పుందన్నారు. డబ్బు పంచే వారికి, తీసుకొనే వారికి ఇద్దరికీ సిగ్గు లేదన్నారు. ఎన్నికల్లో డబ్బు ప్రాధాన్యతను ఎలా తగ్గించాలో అర్థం కావడం లేదన్నారు. పనిలోపనిగా పత్రికలు, టీవీ ఛానళ్లపైనా చురకలు వేశారు. వీళ్లు ఒక్కో పార్టీకి కొమ్ము కాస్తుండడం బాధాకరం అన్నారు. ఈ సమావేశంలో బిజెపి నేతలు సురేంద్రరెడ్డి, ఆంజనేయరెడ్డి, సురేష్‌రెడ్డి, రమేష్ తదితరులు పాల్గొన్నారు.

# ప్రభుత్వ స్థలాల పరిరక్షణ సాధ్యమేనా?

జిల్లా అధికార యంత్రాంగం ప్రభుత్వ స్థలాల పరిరక్షణకు చర్యలు తీసుకోవాలని నిర్ణయించింది. జిల్లా జాయింట్ కలెక్టర్ లక్ష్మీకాంతం పర్యవేక్షణలో శ్రీకారం చుట్టనున్నారు. చాలా సంవత్సరాల అనంతరం అధికారులు ఇటువంటి నిర్ణయం తీసుకోవడం అభినందనీయంగా భావించాలి. కానీ ఇప్పటికే నగ

**రంగంలోకి దిగనున్న జెసి**

రంతోపాటు జిల్లాలోని వివిధ ప్రాంతాల్లో ప్రభుత్వ స్థలాలు, భూములు ఆక్రమణలకు గురికాబడి వున్నాయి. నెల్లూరు నగరంలో కోట్ల రూపాయలు విలువచేసే ఖాళీ స్థలాలు రాజకీయ నేతల సహకారంతో వారి అనుచరులు కబ్జా చేసేశారు. ఇటు కార్పొరేషన్ అధికారులుకానీ, అటు రెవిన్యూ అధికారులు కానీ ఆక్రమణలు, కబ్జాల గురించి ఏ మాత్రం పట్టించుకోవడం లేదు. ఆక్రమణల గురించి అనేక దఫాలు పత్రికల్లో వార్తా కథనాలు వచ్చినా అధికార యంత్రాంగం ఏమాత్రం స్పందించలేని పరిస్థితి. జాయింట్ కలెక్టర్ ఆగస్టు నుండి ప్రభుత్వ స్థలాలను గుర్తించి వాటిని పరిరక్షించే బాధ్యతను సంబంధిత శాఖలకు అప్పగించారు. దీంతో అధికారులు తలలు పట్టుకొంటున్నారు. కలెక్టర్ తీసుకున్న నిర్ణయం ఎలా అమలు చేయాలన్న సందిగ్దంలో వున్నారు. కబ్జాదారుల్లో ఏదో ఒక రాజకీయ పార్టీకి చెందిన వారుండడంతో అధికారులపై ఒత్తిళ్లు వచ్చే అవకాశం వుంటుందని అభిప్రాయపడుతున్నారు. ఈ నేపధ్యంలో ప్రభుత్వ స్థలాలు పరిరక్షణ సాధ్యపడుతుందా అన్న సందేహం కలుగుతుంది.


రోడ్లపై లేస్తున్న దుమ్ము మధ్య వాహన చోదకుల ఇక్కట్లు.

# నగరంపై దుమ్ము తెర!

**అల్లాడుతున్న జనం**

నగరాన్ని దుమ్ము, ధూళి పరదాలా కప్పేస్తున్నాయి. రోడ్లపై పేరుకుపోతున్న దుమ్మును తొలగించకపోవడం, మరోవైపు రోడ్ల నిర్మాణ పనులు జరుగుతుండడంతో నగరం అంతా దుమ్ముతో పేరుకుపోతోంది. తెరలా కప్పేసుకొంటుంది. పారిశుద్ధ్య కార్మికులు తగిన సంఖ్యలో కార్పొరేషన్‌లో వున్నా సరిగా విధులు నిర్వహించకపోవడంతో రోడ్లపై ఎక్కడికక్కడ దుమ్ము, ధూళి పేరుకపోతున్నాయి. వాహనాల రాకపోకల సమయంలో ఇది పైకెగసి పడుతుండడంతో ప్రజలు తీవ్ర ఇబ్బందులు పడుతున్నారు. దీనికితోడు వర్షం కురుస్తుండడంతో ఈ సమస్య అధికమవుతోంది. ఇక రోడ్ల నిర్మాణ పనుల పేరుతో ఎక్కడికక్కడ కంకర, సిమెంటు, ఇసుక తోలివేసి వుండడంతో వాటి నుంచి వచ్చే దుమ్ము, ఇసుక రేణువులు వాహనాలు నడిపే వారికి, పాదచారుల కళ్లలో పడి ఇబ్బందికి గురిచేస్తున్నాయి. ఇక పారిశుద్ధ్యం పరిస్థితి అధ్వాన్నంగా వుంది. ట్రంకురోడ్డులోని మెడికల్ ఏజెన్సీలు వుండే వీధి, మద్రాస్ బస్టాండ్ వద్దల కూరగాయల మార్కెట్‌ను పరిశీలిస్తే పారిశుద్ధ్యం ఎంత అస్తవ్యస్తంగా వుందో అవగతమవుతుంది. మరోవైపు కొన్ని ప్రాంతాల్లో చెత్తను ఎత్తుకు పోతున్నప్పటికీ లారీల్లో, మినీ ట్రక్కుల్లో తీసుకెళ్లే చెత్త ఎగురకుండా చేసేందుకు ఎలాంటి చర్యలు చేపట్టక పోవడంతో ఆ చెత్తంతా రోడ్లపైపడి మరింత ముదనష్టంగా మారుతోంది. ఎవరైనా విఐపిలు వస్తున్నప్పుడు మాత్రం ఆయా ప్రాంతాలలో రోడ్లు శుభ్రపరచి, మట్టిని తొలగించి బ్లీచింగ్ చల్లడం తప్ప విధిగా రోడ్లపై వున్న మట్టిని తొలగించకపోవడం, పారిశుద్ధ్యం మెరుగుకు చర్యలు చేపట్టక పోతుండడంతో నగర వాసుల పాలిట శాపంగా పరిణమిస్తోంది.

## పోలవరం దేముడిచ్చిన వరం

16వ పేజీ కొరవ

స్తాయి. అంతమేర కృష్ణానది నీటిని రాయలసీమ జిల్లాలకు తరలించుకోవచ్చు. పోలవరానికి ఎడమ వైపు నిర్మించే 181 కిలోమీటర్ల పొడవైన కాలువ తూర్పు గోదావరి, విశాఖపట్నం జిల్లాలలో 4 లక్షల ఎకరాలకు నీటి వసతి కల్పిస్తుంది. అదనంగా విశాఖ పట్నం, విజయనగరం, శ్రీకాకుళం తదితర నగరాల మంచినీటి అవసరాలు తీరుస్తుంది.

అంటే, ఈ ఒక్క ప్రాజెక్ట్‌తో సగభాగం ఆంధ్ర జిల్లాల దాహం తీరిపోతుందన్న మాట.

### సవాలక్ష అడ్డంకులు

పోలవరం నీటి నిల్వ సామర్థ్యం కేవలం 75 టిఎంసిలు మాత్రమే. నాగార్జునసాగర్‌తో పోలిస్తే ఐదో వంతు. కానీ దీనివల్ల మునిగిపోయే గ్రామాల సంఖ్య మాత్రం 275. దాదాపు 4లక్షల మంది ప్రజ లను వూళ్ల నుంచి తరలించాలి. వీరందరూ గిరిజ నులు. ఒక్క మన రాష్ట్రమే కాక, చత్తీస్‌ఘడ్, ఒరిస్సా రాష్ట్రాలలోని కొన్ని గ్రామాలను కూడా ఖాళీ చేయిం చాలి. అందువల్ల ఆ రెండు రాష్ట్రాలు అభ్యంతరం చెప్తున్నాయి. మరొకప్రక్క గిరిజనుల హక్కుల పోరాట సంస్థలు తీవ్రంగా ప్రతిఘటిస్తున్నాయి. పైగా ప్రాజెక్ట్ ప్రాంతం మొత్తం దట్టమైన అడవులు. అటవీ శాఖ అనుమతి తేవడం తలకు మించిన భార మౌతున్నది.

1941లో బ్రిటీష్ ప్రభుత్వం పోలవరాన్ని 127 కోట్ల రూపాయలతో కట్టడానికి సిద్ధమైంది. కానీ ఇప్పుడదే ప్రాజెక్ట్ ఖర్చు 20వేల కోట్ల రూపా యలు దాటుతున్నది. ఇందులో ఇప్పటికే 5వేల కోట్ల వరకు ఖర్చుపెట్టి, కుడి, ఎడమ కాలువలు ముప్పాతిక భాగం త్రవ్వారు. కేంద్ర ప్రభుత్వం దీన్ని జాతీయ ప్రాజెక్ట్‌గా పరిగణిస్తే, మొత్తం ఖర్చులో 90 శాతం వారే భరిస్తారు.

## ఆంధ్రులకు ఎన్నో లాభాలు

16వ పేజీ కొరవ

దలు కాబట్టి, పోతిరెడ్డిపాడు వలె వెడల్పైన రెగ్యు లేటర్ నిర్మాణం వీలు కాదు. సొరంగాల ద్వారా నీరు పారించుకోవాలి. అందువల్ల కృష్ణానది వరద నీటిని వారు పెద్దగా వినియోగించుకోలేరు. వారి నీటి అవసరాలన్నీ గోదావరి మీద నిర్మితమౌతున్న దుమ్ముగూడెం, ప్రాణహిత, ఎల్లంపల్లి, ఇచ్చంపల్లి, కంతనపల్లి వంటి ప్రాజెక్టుల ద్వారా తీరుతాయి. కృష్ణా నది మనకు ఉపయోగపడుతుంది.

దుమ్ముగూడెం – నాగార్జునసాగర్ టెయిల్ పాండ్, పోలవరం ప్రాజెక్ట్‌ల ద్వారా గోదావరి నీళ్లు మనకు లభిస్తాయి. కృష్ణలోని నికరమైన జలాల మీద ఆధారపడిన కృష్ణ, గుంటూరు వంటి జిల్లాలకు గోదా వరి నీరు ఇచ్చి, రాయలసీమ, నెల్లూరు జిల్లాలు కృష్ణ నీళ్లు వాడుకోవచ్చు. అందువల్ల సోమశిల వంటి ప్రాజెక్ట్‌లకు నికర జలాలు లభించే అరుదైన అవకా శం లభిస్తుంది. రాష్ట్ర విభజన వల్ల మనకు జరుగు తున్న మహోపకారం ఇది.

## భావోద్వేగమే సమస్య!

9వ పేజీ కొరవ

పెట్టడం కోసం జవహర్‌లాల్ నెహ్రూ వారిని బల వంతంగా విలీనానికి ఒప్పించాడు. దాని వెనుక కమ్యూనిస్టుల ప్రోద్బలం కూడా వుంది. తెలంగాణ మొత్తం ఫాసిస్టు సమాజంగా వుండేదప్పుడు. దొరల పాలనలో అట్టడుగు వర్గాల ప్రజలు వర్ణించరాని బాధలు అనుభవించేవారు. మొదట నిజాం నిరం కుశ పాలన నుంచి, ఆ తర్వాత దొరల కర్కశ పెత్త నం నుంచి సామాన్య ప్రజలకు విముక్తి కల్పించ డానికి కమ్యూనిస్టులు వీరోచిత పోరాటం జరిపారు. మొదట రైతాంగ పోరాటంగా మొదలై ఆ తర్వాత విశాలాంధ్ర ఉద్యమంగా రూపు దిద్దుకొన్నది. జవ హర్‌లాల్ నెహ్రూ విలీన నిర్ణయం మీద ఈ కమ్యూ నిస్టు ఉద్యమ ప్రభావం వుంది. నిజానికి అప్పట్లో రాష్ట్రాల పునర్విభజన కోసం ఏర్పడిన ఫజల్ అలీ కమిషన్ విలీనానికి పూర్తి సమ్మతి తెలపలేదు. 1961 సాధారణ ఎన్నికల తర్వాత ఏర్పడే శాసనసభ, మూడింట రెండు వంతుల మెజార్టీతో ఆంధ్రలో విలీ నమై ఆమోదించినప్పుడు మాత్రమే విలీన ప్రక్రియ జరగాలని సిఫార్సు చేసింది కమిషన్. కానీ నెహ్రూ తొందరపడి నిర్ణయం తీసుకొన్నాడు. అయితే ఆయన కూడా, ఆంధ్ర, తెలంగాణ అనేవి భార్యాభర్తల వం టివని, ఈ వివాహం నచ్చక పోతే విడాకులు తీసు కొనే స్వేచ్ఛ ఇద్దరికీ వుందని ప్రకటించాడు.

## రాజధాని ఎక్కడ

9వ పేజీ కొరవ

క్షేత్రంగా విలసిల్లుతున్న తిరుపతి అయితే బేష్ అని ఒక వర్గం వాదన. అయితే ఇవేవీ కాకుండా, విశాల మైన భూమి సేకరించి, కొత్తగా ఒక నగరాన్ని నిర్మిం చడమే ఆంధ్రప్రదేశ్ భవిష్యత్తుకు శ్రేయస్కరమని నిపు ణుల భావన. భవన నిర్మాణ రంగంలో ఇప్పుడు అత్యంత ఆధునిక సాంకేతిక పరిజ్ఞానం అందుబా టులో వుంది. భారీ భవంతులు కూడా ఏడాది లోపల కట్ట గలిగే యంత్ర పరికరాలున్నాయి. పాతిక ముప్పై వేల ఎకరాలు సేకరించి, కొత్త నగరానికి ప్రణాళిక రచిస్తే, సింగపూర్, హాంకాంగ్‌ల తలదన్నే అంతర్జా తీయ స్థాయి నగరాన్ని పదేళ్లలోపల అద్భుతంగా నిర్మించుకోవచ్చు. మొత్తం ప్రపంచానికే దాన్నొక నమూనాగా చూపించుకోవచ్చు. అటువంటి నగరం కొత్త పెట్టుబడులు, శీఘ్ర ప్రగతికి ఎంతగానో దోహద పడుతుంది.

నెల్లూరు జిల్లా ఉత్తర సరిహద్దు రామా యపట్నం నుంచి గుంటూరుజిల్లా దక్షిణ సరిహద్దు చీరాల వరకు సముద్ర తీరంలో విస్తారంగా భూమి, అందులోను ప్రభుత్వ భూమి అందుబాటులో వుంది. నిమ్మగడ్డ ప్రసాద్‌కు చెందిన వాన్‌పిక్ సంస్థ చేతిలోనే దాదాపు 27వేల ఎకరాలున్నాయి. ఈ భూమి సేకరించడం చాలా సులువు, చవక కూడా. ముప్పైవేల ఎకరాలంటే దాదాపు 120 చదరపు కిలో మీటర్ల పరిధి. అంత విస్తీర్ణంలో సింగపూర్ కంటే అందమైన, విశాలమైన నగరాన్ని నిర్మించుకోవచ్చు. ఆధునిక విమానాశ్రయం, ఓడరేవు, హోటళ్లు ప్రణా ళికాబద్ధమైన రోడ్లు, నివాస ప్రాంతాలు, ప్రభుత్వ కార్యాలయాల సముదాయం వంటివి ఏర్పరచుకో వచ్చు. అందుకు ఎంతో సమయం కూడా పట్టదు.

గుంటూరు జిల్లా మంగళగిరి ప్రాంతంలో కూడా విశాలమైన భూమి అందుబాటులో వుందని చెప్తున్నారు. గుంటూరు, ఒంగోలు ప్రాంతాలు మొత్తం రాష్ట్రానికి అందుబాటులో వుంటాయి. జాతీయ రహ దారి, జాతీయ రైల్వే వ్యవస్థల పక్కనున్నాయి కాబట్టి, రవాణా సమస్య వుండదు. రాజధాని నిర్ణయం పెద్ద సమస్యగా పరిగణించే ప్రమాదం వుంది. రాయల సీమ, కోస్తా జిల్లా లవాసుల మధ్య ఆవేశకావేషాలు పెంచే చిక్కు ముడి ఇది. దీన్ని నేర్పుగా విప్పగలి గితేనే కొత్త రాష్ట్రంలో శాంతి నెలకొంటుంది.

## చిటికెలో వీడిన చిక్కుముడి!

మొదటి పేజీ కొరవ

కూడబెట్టుకొన్నది. పాపం, పుణ్యం రెండూ ఆమెవే. కానీ అందుకు కారణం మాత్రం రాష్ట్ర రాజకీయ నేతలందరిదీ. మూడేళ్ల నుంచి కేంద్రం ఈ విష యంలో సంప్రదింపులు జరుపుతున్నది. శ్రీకృష్ణ కమిటీ వేసింది. ఒకటికి రెండుసార్లు అఖిల పక్ష సమావేశాలు జరిపింది. కానీ ఒక్క సందర్భంలో కూడా ఒక్క రాజకీయపార్టీ కూడా అభిప్రాయాన్ని నిర్దష్టంగా చెప్పలేదు. కాంగ్రెస్, తెలుగుదేశంలలోని రెండు ప్రాంతాల నేతలు రెండు వాదనలు విన్పిం చారు. జగన్ పార్టీ గోడ మీద పిల్లి వాటం ప్రదర్శిం చింది. ఈ పార్టీలలోని సమైక్యవాదులు కూడా స్పష్టంగా తమకు సమైక్య రాష్ట్రం కావాలని కోర లేదు. చెప్పాల్సిందంతా చెప్పి, అధి ష్ఠానం నిర్ణ యమే శిరోధార్యమని ముక్తాయింపు చెప్పే వారు.

### ఆంధ్ర పౌరుషంతో సోనియా పాదాలకు పారాణి

కాంగ్రెస్‌లో ఆంధ్ర ప్రాంతం నుంచి వీరాధి వీరులున్నారు. మీసాలు తెగ తిప్పారు. కానీ చివరి కొచ్చేసరికి అంతా కలిసి ఆంధ్ర పౌరుషాన్ని పారా ణిగా మలచి సోనియమ్మ కాళ్లకు పదిలంగా అలంక రించారు. ఒక్కరంటే ఒక్క నేత కూడా గట్టిగా సమైక్య వాదం విన్పించలేదు. ఇస్తే ఒప్పుకోమని హెచ్చరిక చేయలేదు. తెలంగాణ వాదులు మాత్రం ఘాటైన పోకడ అవలంబించారు. రాష్ట్ర మంత్రులందరూ తెలంగాణ ఇవ్వకుంటే పార్టీ వీడుతామని స్పష్టమైన సంకేతాలిచ్చారు. కెకె వారు అన్నంత పని చేశారు. ఆ మోస్తరుగా సమైక్యవాదం చేసిన వారు ఒక్కరు న్నారేమో చూపండి.

### విదూషకుడి వంచన

లగడపాటి రాజగోపాల్ సంగతే చూడండి. సమైక్యవాదం విషయంలో ఆయన విదూషకపు పనులు చాలానే చేశాడు. నిజం చెప్పాలంటే, రాజ కీయ వాదులకే పరిమితమై వుండిన తెలంగాణ ఉద్య మాన్ని ప్రజల సెంటిమెంట్‌గా రెచ్చగొట్టిన వాడు లగడపాటి. ఆయన చేసిన విదూషక చేష్టల వల్ల తెలంగాణ సగటు పౌరుడిలో కూడా ప్రాంతీయ వాదన బలపడింది. ఆంధ్రులు దురంహకారులనే దురభిప్రాయం ఏర్పడింది. కానీ ఇప్పుడు అదే లగడపాటి రాజగోపాల్, రాజీనామాలతో ఒరిగేది ఏమీ లేదు, ఆంధ్ర ప్రాంతం వాటా, హక్కుల కోసం పోరాడాలని పిలుపు ఇస్తున్నాడు. దాదాపుగా ఆంధ్ర ప్రాంతం నేతలందరిదీ ఇదే వరస.

### అందరూ వ్యాపారులే!

అందుకు కారణం – మన నేతలంతా వ్యాపా రులు కావడం. లగడపాటి, కావూరి, రాయపాటి, మాగుంట వంటి ఎమ్పీలందరికీ ఢిల్లీ సర్కారుతో నిత్యం పని. ఒక్కొక్కరికి వేల కోట్ల రూపాయల బ్యాంక్ అప్పులున్నాయి. వాటిని కట్టే ఉద్దేశ్యం మాత్రం లేదు. సోనియమ్మ మాట ధిక్కరిస్తే పక్కరోజు బ్యాంక్ అధి కారులొచ్చి ఇల్లు జప్తు చేస్తారని భయం. వారి ఆసక్తి అంతా ఆస్తుల మీద తప్ప ప్రాంతం మీద కాదు. రాష్ట్రంలోని మంత్రుల సంగతీ అంతే. గంటా, టిజి. వెంకటేష్ తదితరులకు ప్రభుత్వంతోనే వ్యాపారం.

### చిరంజీవి ఆదుర్దా సినిమా పైన...

కేంద్రమంత్రి చిరంజీవి వున్నాడు. ప్రజలలో ఆదరణ వున్న నేత. కానీ ఆయన ఆదుర్దా అంతా కొడుకు సినిమా మీద తప్ప జనం మీద కాదు. 2తేది విడుదల కావలసిన రాంచరణ్ తేజ ఎవడు సినిమాను వాయిదా వేసుకోమని నిర్మాతలకు రెండు వారాల ముందే చెప్పాడట. దాని అర్ధం – సోనియాగాంధీ తెలంగాణ ఇచ్చేస్తున్నదని, ఆ ప్రకటన జూలై చివరి వారంలో వెలువడుతుందని ఆయనకు ముందుగానే తెలుసు. కానీ చేసింది మాత్రం ఏమీ లేదు.

### అందుకే స్పందన లేదు

నేతలలో చిత్తశుద్ధి లేనందువల్లనే ఆంధ్ర ప్రాంతంలో రాష్ట్ర విభజన పట్ల స్పందనే కన్పించ లేదు. టీవీ ఛానళ్లు తమ వ్యాపారం కోసం చిన్న సంఘటనలను పెద్దవిగా చూపడం తప్ప, నిజమైన నిరసన లేదు. ప్రజలు ఈ పరిణామాన్ని పట్టించు కొన్న పాపాన పోవడం లేదు. ప్రకటన ముందు వరకు వీరావేశాలు ప్రదర్శించిన కాంగ్రెస్ నేత లంతా ఆ రాత్రి అదృశ్యమై పోయారు.

### పదినెలల కసరత్తు

సోనియాగాంధీ నిర్ణయం జూలై 30తేది వెలువడినా, దాని వెనుక ఆమె దాదాపు పది నెలల పాటు కసరత్తు చేశారని తెలుస్తున్నది. నమ్మకమైన ఐఎఎస్, ఐపిఎస్, ఐబి అధికారులు కొందరిని పురమాయించి, మొత్తం సమస్యను అన్ని కోణాలలో క్షుణ్ణంగా అధ్యయనం చేశారట. నిర్ణయానికి వచ్చిన తర్వాత కూడా నిరసనలు ఎదుర్కోవడానికి ఎన్నో జాగ్రత్తలు తీసుకొన్నారు. కీలకమైన జిల్లాలన్నింటిలో మిలటరీ బలగాలు దింపారు. లగడపాటి వంటి జగడపాటులను ముందుగానే పిలిచి, గట్టి వార్నింగ్ ఇచ్చారట. కిరణ్‌కు కూడా అదే రకమైన సంకేతం వెళ్లింది. నీకు చేతకాకుంటే వేరే వారిని పెట్టి నిర్ణ యం ప్రకటిస్తామని చెప్పారట. పదవి పోగొట్టుకో వడం ఎందుకని ఆయన తలదించుకొని వచ్చేశాడు.

### దేన్ని ఆశించారు?

తెలంగాణపై ఇంత నిర్దుష్టమైన నిర్ణయం తీసుకోవడం వెనుక ఉద్దేశ్యం ఏమిటి? ఉద్యమం తీవ్రమౌతుండడం వల్ల రాష్ట్రంలో ఇబ్బందులొస్తున్నా యన్నది నిజమే. కానీ ఉద్యమాన్ని అణిచి వేసే ప్రయ త్నం చేసి, అది వీలు కాకుంటే నిర్ణయం తీసుకో వాలి. కానీ మొదటిదాన్ని వదలి పెట్టి రెండవదాన్ని ఎంచుకోవడానికి రాజకీయమే కారణమని పరిశీ లకుల భావన. 2014 ఎన్నికలలో కాంగ్రెస్ క్లిష్టమైన పరిస్థితిలో పడబోతున్నది. ఉత్తరభారతదేశంలో నరేంద్రమోడి ప్రభంజనం ఒక సమస్య, మూడవ ఫ్రంట్ ప్రయత్నం మరొక సమస్య. ఈ దశలో ఆం ధ్రలో స్థానాలు పోతే అధికారం కల్ల. ఏదో ఒకటి చేసి ఆంధ్రలో సీట్లు నిలుపుకోవాలి. అందుకు తెలం గాణ ఒక బ్రహ్మాస్త్రం అనుకొన్నట్లున్నారు. ఈ ప్రక టన ద్వారా ఒకే దెబ్బకు రెండు పిట్టలు కొట్టింది సోనియాగాంధీ. వైఎస్‌జగన్ తెలంగాణలో అడ్రస్ లేకుండా పోయాడు. కెసిఆర్ ఆత్మరక్షణలో పడిపో యాడు. కాంగ్రెస్‌తో కలవక తప్పని పరిస్థితి. మజ్లి స్‌లు జగన్‌ను నమ్ముకొని కిరణ్‌తో పేచీ పెట్టుకొన్నారు. కానీ ఇప్పుడు మళ్లీ కాంగ్రెస్ శరణు చొచ్చక తప్పదు. ఈ మూడు ప్రాంతీయ శక్తుల నిర్వీర్యం ద్వారా అక్కడున్న 17 సీట్లలో మెజార్టీ గెలు చుకోవచ్చునని సోనియా ఆశ. తెలంగాణ ఓటర్లు గత కొంతకాలంగా రాజకీయం పక్కనపెట్టి, కేవలం రాష్ట్ర విభజన నినాదానికే ఓటు వేస్తున్నారు. ఆ కల నెరవేర్చిన కాంగ్రెస్‌కు, అది చేసిన తప్పులు మరచి పోయి ఓటు వేయడం సాధ్యమే కదా?

## పదరంగం -78

నిర్వహణ : బాబాజీ

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | | 3 | | 4 | | 5 | | 6 |
| 7 | | | 8 | 9 | | | 10 | 11 | |
| | | 12 | | | | 13 | | | |
| | 14 | | | 15 | | | | | |
| 16 | | | | | | 17 | | | |
| 18 | | | 19 | | 20 | | | | 21 |
| 22 | | | | | | | 23 | | |
| | | 24 | | | 25 | 26 | | | |
| 27 | 28 | | | 29 | | | | 30 | |
| 31 | | | | 32 | | | | | |

**అడ్డం**

1. పగతీర్చుకోవడం (4)
4. యుద్ధం, ప్రముఖ నాస్తికవాది (3)
7. శాపం కాదు, దేవుడిచ్చేది (2)
8. ప్రపంచం, చందూర్‌గారి ఒకప్పటి మాసపత్రిక (3)
10. గడ్డపార (3)
12. స్త్రీ, స్త్రీల మాసపత్రిక (3)
13. భార్యాభర్త (4)
14. తోక తెగిన సాధువు (2)
15. తెలుగు డిస్కౌంట్ (3)
16. బిర్రు, చెట్టు (3)
17. తడబడిన అధరం (3)
18. అణాలో ఆరవ వంతు నాణెం బట్ అయితే...? (2)
19. ఆలపించడం (4)
22. మధ్య అక్షరం లోపించిన రిపేరు (2)
23. రామలక్ష్మణులు వధించిన ఆడ రాక్షసి (3)
24. లోబడి వుండడం (2)
25. పరుషం కానిది (3)
27. ఎంత చెప్పినా వాళ్లు.... (3)
29. తలంటుకు వాడుకొనే కాయ (3)
30. గ్రాండ్ ఫాదర్ (2)
31. బధిరత్వం (3)
32. శారీరక శ్రమ (4)

**నిలువు**

1. పూజా సమయంలో గోత్ర నామాలు చెప్పుకోవడం (3)
2. ఒడ్డు (2)
3. రంజింప చేయునది (3)
4. భార్య, శివుని భార్య, ఒకప్పటి దురాచారం (2)
5. తెలుగు కలర్స్ (3)
6. క్రిందనుంచి బుట్టలు, సున్నా తడబడింది (3)
9. గతించిన కాలం (3)
11. వందనం (4)
12. పెండ్లి కుమార్తె (3)
13. ఆరాధించడం (4)
14. వ్యవసాయానికి జలం (4)
16. నిర్భాగ్యుడు, సన్యాసి (3)
19. నింగి (3)
20. జాక్‌ఫ్రూట్ (5)
21. గుఱ్ఱాలు చేసే శబ్దాలు (5)
23. బీగం, పాటకు వేసేది (2)
24. పెండ్లి కుమారుడు (3)
26. తడబడిన యకర (3)
27. క్రిందనుంచి కర్ణము (2)
28. తలతెగిన వినవు (2)
29. క్రిందనుంచి వారణాశి (2)

**సమాధానాలు**

## పదరంగం -77

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 పా | 2 రం | గ | 3 తు | 4 డు | | 5 వా | 6 యు | 7 లీ | నం |
| 8 తా | పు | | 9 ల | కా | 10 రం | | 11 వ | ల | |
| 12 శం | గో | | | | 13 మా | రు | తి | | 14 ఆ |
| | | 15 అ | ప | 16 వా | దు | | | 17 ప్రి | పా |
| 18 స | 19 క | ల | | ణి | | | 20 ఎ | డ | ద |
| 21 వా | రే | వా | | | 22 వ | 23 వి | లు | | మ |
| రి | | 24 టు | ఇ | 25 క | | 26 ము | క | 27 పు | స్త |
| | 28 క | | | 29 వి | ర | క్తి | | 30 ల | క |
| 31 అ | | 32 ఉ | 33 న్న | త | | | 34 శా | క | ము |
| 35 సి | రి | | 36 వె | లు | గు | | 37 ఖ | రం | |

# సంక్షిప్త సింహపురి

## ప్రసన్న, చంద్రశేఖర్‌రెడ్డిల రాజీనామా!

రాష్ట్రాన్ని సమైక్యంగా ఉంచడమా లేక విభజించడమా అనే అంశంపై కాంగ్రెస్ పార్టీ అధిష్ఠానం వెంటనే తన నిర్ణయం ప్రకటించాలనే డిమాండ్‌తో వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీకి చెందిన కోవూరు, ఉదయగిరి ఎమ్మెల్యేలు నల్లపరెడ్డి ప్రసన్నకుమార్‌రెడ్డి, మేకపాటి చంద్రశేఖర్‌రెడ్డిలు తమ శాసన సభ్యత్వాలకు రాజీనామాలు చేశారు. తమ రాజీనామాలను ఫ్యాక్స్ ద్వారా స్పీకర్‌కు పంపారు. వీటిని ఆమోదించేందుకు స్పీకర్ ఫార్మేట్‌లోనే పంపారు. ఈ సందర్భాన్ని పురస్కరించుకొని నల్లపరెడ్డి ప్రసన్నకుమార్‌రెడ్డి మాట్లాడుతూ రాష్ట్రం సమైక్యమా, విభజన అనే అంశంపై నాన్పుడు ధోరణికి కాంగ్రెస్ పార్టీ అధినేత్రి సోనియాగాంధీ స్వస్తి పలకాలన్నారు. అన్ని ప్రాంతాల నాయకులను పిలిచి అన్ని అంశాలపై మాట్లాడి వెంటనే నిర్ణయం తీసుకోవాలని ప్రసన్నకుమార్‌రెడ్డి డిమాండ్ చేశారు.

## యుపిఏ విఫలం!



రోజుకో అవినీతి కుంభకోణంతో యుపిఏ ప్రభుత్వం అప్రతిష్ట పాలయ్యిందని బిజెపి జాతీయ నేత ముప్పవరపు వెంకయ్యనాయుడు విమర్శించారు. 24వ తేది నెల్లూరు మినీ బైపాసు రోడ్డులోని పార్టీ కార్యాలయంలో విలేకరులతో మాట్లాడారు. యుపిఏ పాలనలో అవినీతి, అరాచకం, అధ్వాన్నం, అస్తవ్యస్తం, ఆర్థిక భద్రత లేకపోవడం వంటి కారణాలతో దేశం అధోగతి పాలయ్యింది. బిజెపిని కాంగ్రెస్ పార్టీ పదే పదే మతతత్వ పార్టీఅని విమర్శిస్తూ పాకిస్తాన్‌కు అధికార కాంగ్రెస్ పార్టీ పెద్దలంతా పావుల్లా ఉపయోగపడుతున్నారు. వివిధ దుర్ఘటనలు చోటుచేసుకొన్నప్పుడు పాక్ ప్రేరేపిత ఉగ్రవాద సంస్థల్ని ఉద్దేశించి పలు పేర్లు చెబుతూ కాలయాపన చేస్తున్నారని విమర్శించారు. బిజెపిని క్షేత్రస్థాయిలో పటిష్టం చేయడం ద్వారా వచ్చే ఎన్నికల్లో అత్యధిక స్థానాల్లో గెలిపించాల్సిన ఆవశ్యకత పార్టీ నేతలపై ఉందన్నారు. బిజెపి జిల్లా అధ్యక్షుడు సురేంద్రరెడ్డి, రాష్ట్ర ప్రధాన కార్యదర్శి సురేష్‌రెడ్డి, రాష్ట్ర అధికార ప్రతినిధి కర్నాటి ఆంజనేయరెడ్డి తదితరులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

## విఆర్ సంస్థల్లో కొనసాగుతున్న అరాచకాలు!

నెల్లూరులోని విఆర్ విద్యా సంస్థలలో అరాచకాలు ఆగడంలేదని ఇక్కడ పనిచేసే లెక్చరర్లు వాపోతున్నారు. సంస్థలలో పనిచేసే ఉద్యోగులపై జులుం ఎక్కువయ్యిందన్నారు. దీనికి కారణం సిఇఓగా సుధాకర్‌రెడ్డి బాధ్యతలు తీసుకోవడమేనంటున్నారు. సుధాకర్‌రెడ్డి 40వేల రూపాయలు నెలకు జీతం తీసుకొంటూ కష్టపడి పనిచేసే ఉద్యోగులకు నాలుగు వేల రూపాయలివ్వను నానా మాటలంటారట. 15 నుంచి 20 సంవత్సరాల సర్వీసు ఉన్న వాళ్లను కూడా నేటికీ పర్మినెంట్ చేయలేదట. విఆర్ ఐఏఎస్, విఆర్ ఐపిఎస్‌లో పనిచేసే వాళ్ల పరిస్థితి నానాటికీ తీసికట్టు నాగంభట్టులా తయారయ్యిందంటున్నారు. అయినా విఆర్ సంస్థల మేనేజ్‌మెంట్‌కు వ్యతిరేకంగా నిర్ణయాలు తీసుకొనే దమ్మున్న అధికారులు జిల్లాలో ఎవరున్నారు చెప్పండి.

## నేతాజీ పైలెట్ స్కూల్‌కు ప్రతిభా అవార్డు!



ఈ యేడాది జరిగిన పదవ తరగతి పబ్లిక్ పరీక్షల్లో పది పాయింట్లకు పది పాయింట్లను సాధించినందుకు నెల్లూరు విజయ మహల్ గేటు వద్ద శ్రీ నేతాజి పైలెట్ హైస్కూల్ విద్యార్థిని షేక్ అర్షియా యాస్మిన్‌ను రాష్ట్ర ప్రభుత్వం ప్రతిభా అవార్డును ప్రకటించింది. దీన్ని జిల్లా కలెక్టర్ శ్రీకాంత్ తన చేతులమీదుగా షేక్ అర్షియాకు అందించారు. ఈ కార్యక్రమంలో నేతాజి పైలెట్ స్కూల్ కరస్పాండెంట్ సుబ్బారెడ్డి కూడా పాల్గొన్నారు.

## మునిసిపల్ కార్మికుల సమస్యలు పరిష్కరించండి!



ఆంధ్రప్రదేశ్ మునిసిపల్ వర్కర్స్ అండ్ ఎంప్లాయిస్ యూనియన్ ఆధ్వర్యంలో నెల్లూరు కార్పొరేషన్‌లోని నాల్గవ డివిజన్‌లో పనిచేస్తున్న కార్మికులు డిమాండ్ డే కార్యక్రమంలో పాల్గొన్నారు. ఈ సందర్భంగా కార్పొరేషన్ ఆఫీసు ముందు సంఘం ఉపాధ్యక్షుడు అల్లాడి గోపాల్ మాట్లాడుతూ సొసైటీ కార్మికులు, రెవిన్యూ, ఎస్టాబ్లిష్‌మెంట్, స్ట్రీట్ లైటింగ్, పబ్లిక్ హెల్త్, పారిశుద్ధ్యం, డ్రైవర్స్, డ్రైనేజ తదితర రంగాలలో విధి నిర్వహణలోని కార్మికులు అనేక సమస్యలు ఎదుర్కొంటున్నారు. కార్పొరేషన్ ఉద్యోగులకు మూడు, నాలుగు నెలలకొకసారి జీతాలిస్తున్నారు. ఈవిధంగా ఇవ్వడం వల్ల కార్మికులు ఇబ్బందులు పడుతున్నారు. ఎన్.ఎం.ఆర్‌లకు కనీస వేతనంగా 12500 రూపాయలివ్వాలని డిమాండ్ చేశారు. 29, 30, 31 తేదీలలో కార్మికుల కుటుంబ సభ్యులు కూడా సామూహిక నిరాహార దీక్షలలో పాల్గొంటారన్నారు. ఈ కార్యక్రమంలో తాళ్లూరు సత్యం, జి.కొండమ్మ, ఆర్.వెంకట్రావు, ఎన్.మాలకొండయ్య, యేసు, మల్లిఖార్జున్, చంద్రమ్మ పాల్గొన్నారు.

# రైతు లోకం

## ఏరోబిక్ వరి సాగు పద్ధతులు

తక్కువ నీరు ఉపయోగించి వరి పండించే ఏరోబిక్ సాగు విధానం ఇటీవల కాలంలో మన రాష్ట్రంలో కూడ ప్రాచుర్యం పొందుచున్నది. ఏరోబిక్ వరిసాగు పద్ధతి 2002 దశకంలో అంతర్జాతీయ వరి పరిశోధనా సంస్థ, ఫిలిప్పీన్స్‌లో విస్తృత పరిశోధనల ద్వారా ఫిలిప్పీన్స్, చైనా, భారతదేశం వంటి దేశాలలో ప్రవేశపెట్టడమైనది. మన రాష్ట్రంలో రైతులు అవలంభించే ఆరుతడి వరి పద్ధతికి చాలా దగ్గరగా వుంటుంది. ఏరోబిక్ వరి పద్ధతిలో వరిని మనం సాధారణంగా పండించే మొక్కజొన్న, జొన్నవంటి పంటల వలె ఆరుతడి పరిస్థితుల్లో పండించడం, పంట అవసరం మేరకు నీటిని పెట్టడం ద్వారా పండించే విధానాన్ని "ఏరోబిక్ వరి" అని వ్యవహరిస్తారు. ఏరోబిక్ వరిని ముఖ్యంగా మాగాణి భూముల్లో సాధారణ పద్ధతిలో సాగు చేయడానికి నీటి లభ్యత తక్కువగా వున్న ప్రాంతాల్లో లేదా వర్షాధార పంటగా పండించే భూముల్లో అడపదడపా నీరు అందించే సౌకర్యం కలిగిన ప్రాంతాల్లో చెరువుల క్రింద సాగు చేసే పద్ధతుల్లో ఈ పద్ధతి అనుకూలంగా వుంటుంది.

డాక్టర్ కె.పుల్లంరాజు
కోఆర్డినేటర్,
ఏరువాక (డాట్ సెంటర్), నెల్లూరు.

ఆరుతడి వరిని పండించడానికి పొలంలో నీటిని నిలగట్టవలసిన అవసరం లేదు. ఆరుతడి (ఏరోబిక్) పద్ధతిలో వరిసాగుకు ఈ క్రింది యాజమాన్య పద్ధతులు ఆచరించాలి.

**అనువైన రకాలు:** ఏరోబిక్ పద్ధతిలో సాగు చేయడానికి లోతైన వేరు వ్యవస్థ కలిగి, బెట్టను తట్టుకునే స్వల్ప లేదా మధ్యకాలిక రకాలు అనుకూలం. విజేత (యం.టి.యు 1001), యం.టి.యు 1010 వంటి రకాలు అనుకూలంగా వున్నట్లు పరిశోధనల్లో తేలింది.

**భూమి తయారీ:** తొలకరి వర్షాలను సద్వినియోగం చేసుకుని పలుమార్లు దున్ని మెత్తని దుక్కి చేసినట్లయితే కలుపు సమస్యను కొంత వరకు అధిగమించవచ్చు. ఆఖరి దుక్కిలో సిఫారసు మేరకు భాస్వరం, పొటాష్ ఎరువులు వేసి కలియదున్ని బాగా చదును చేయాలి. నేల సమతలంగా చదునుగా లేనట్లయితే తేమ సరిగ అందక మొలక సరిగా రాదు. పంట ఎదుగుదల కూడా సమానంగా వుండదు.

కొరవ వచ్చేవారం

Regn.No. : RN 1156 / 57
J/Nellore/008/12-14
జమీన్‌రైతు

# పోలవరం దేముడిచ్చిన వరం!

రాష్ట్ర విభజనకు అన్ని వర్గాల వారూ వ్యక్తం చేసే ప్రథమ అభ్యంతరం – నదీ జలాల పంపకం. ఈ సమస్యకు కేంద్రం ప్రతిపాదించిన పరిష్కారం – పోలవరం. దాని అర్థం – రెండు రాష్ట్రాల జలదాహాన్ని తీర్చే సామర్థ్యం దానొక్కదానికే వుందని.



## అపారమైన జలనిధి

గోదావరి నది అపారమైన జలనిధి. మహారాష్ట్రలోని పశ్చిమ కనుమలలో పిల్ల కాలువ వలె పుట్టే ఈ జీవనది 1230 కిలోమీటర్ల సుదీర్ఘ దూరం ప్రయాణించి, అంతర్వేది దగ్గర సాగరంలో సంగమిస్తుంది. అటు నైరుతీ రుతు పవనాలు, ఇటు ఈశాన్య రుతుపవనాలు రెండింటి వర్షపాతాన్ని తనలో ఇముడ్చుకోవడం వల్ల ఏడాదిలో దాదాపు 10 నెలల పాటు ప్రవాహం వుంటుంది. మహారాష్ట్ర, కర్నాటక, చత్తీస్‌ఘడ్, ఒరిస్సా, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాలకు చెందిన లెక్కలేనన్ని వాగులు, వంకలు, నదులు, జలపాతాలు ఇందులో సంగమిస్తాయి. మన రాష్ట్రం సరిహద్దు దాటే వరకు గోదావరి సాధారణమైన నది. కానీ ఆదిలాబాద్, ఖమ్మం అడవులలో ప్రవహించే ప్రాణహిత, ఇంద్రావతి, శబరి, మంజీరా వంటి ఉపనదులు వచ్చి కలవడంతో ఇదొక మహా నదిగా మారుతుంది.

## బంగారు కల

గోదావరి మీద మన రాష్ట్రానికి సంబంధించి వున్న ప్రధాన ప్రాజెక్టులు ధవళేశ్వరం, శ్రీరాంసాగర్. మొదటి దానివల్ల కృష్ణ, తూర్పు, పశ్చిమ గోదావరి జిల్లాలు, రెండవ దాని వల్ల నిజామాబాద్, కరీంనగర్, వరంగల్ జిల్లాలు ప్రయోజనం పొందుతున్నాయి. అయితే గోదావరికి మొత్తం దక్షిణ భారతదేశ సాగు నీటి అవసరాలు తీర్చగల సామర్థ్యం వుంది. ప్రతి ఏటా మూడు నుంచి ఐదు వేల క్యూసెక్కుల నీరు వృథాగా సముద్రంలో కలుస్తున్నది. అందువల్లనే గోదావరిని కృష్ణతో, కృష్ణను పెన్నతో, పెన్నను కావేరితో కలిపే బృహత్తర నదీ అనుసంధాన ప్రాజెక్ట్ నిర్మించాలని జల నిపుణులు ఎన్నో ఏళ్లుగా కోరుతున్నారు. ఆ బంగారు కలలో ఒక భాగం పోలవరం ప్రాజెక్ట్.

## భగీరథుడు వైఎస్

పోలవరం మీద ప్రాజెక్ట్ నిర్మించాలని మొదటగా నిజాం నవాబు ప్రయత్నం చేశాడు. కొంత పని కూడా జరిగి ఆగిపోయింది. తర్వాత మద్రాసు ప్రెసిడెన్సీ చీఫ్ ఇంజనీర్ సర్ వెంకట కృష్ణ అయ్యర్ సమగ్ర ప్రతిపాదన తయారు చేసి, రామపాద సాగర్ అనే పేరు కూడా పెట్టారు. అప్పట్లో ఆయన వేసిన అంచనా 129 కోట్ల రూపాయలు. కానీ ఏదో ఒక కారణంతో అరవైఏళ్ల పాటు ఇది కాగితాలకే పరిమితమైంది. 2004లో వైఎస్ రాజశేఖర్‌రెడ్డి దీని నిర్మాణానికి చిత్తశుద్ధితో ప్రయత్నం చేశాడు. అప్పటి నుంచే దీనికి కదలిక వచ్చింది.

## దాహం తీరిపోతుంది

పోలవరం నిజంగా బృహత్తర ప్రాజెక్ట్. రాజమండ్రికి 18 కిలోమీటర్ల దూరంలో నదికి అడ్డంగా 5741 అడుగుల పొడవైన ఆనకట్ట కడతారు. కుడి పక్క 174 కిలోమీటర్ల పొడవైన కాలువ త్రవ్వి, విజయవాడ దగ్గర ప్రకాశం బ్యారేజ్‌లో కలుపుతారు. దీనివల్ల కృష్ణ, పశ్చిమ గోదావరి జిల్లాలలో మూడున్నర లక్షల ఎకరాల ఆయకట్టుకు నిరంతరం నీళ్లు దొరకడమేకాక, కృష్ణా నదిలోకి 80 టిఎంసిల నీరు ప్రవహిస్తుంది. నాగార్జునసాగర్ డ్యాం ద్వారా సాగయ్యే కృష్ణా డెల్టా భూములకు గోదావరి నీళ్లు

కొరవ 14వ పేజీలో

# హైదరాబాద్ మన అబ్బ సొత్తేమీ కాదు!



రాష్ట్ర విభజన మీద సాధారణ ప్రజలు కూడా బాధపడుతున్న అంశం – హైదరాబాద్ నగరం. దాన్ని అంత గొప్పగా అభివృద్ధి చేసుకొని వాళ్లకు వదిలేసి రావడం కడుపు మంట కదా అన్నది అందరి ఆవేదన. నిజమే, గత రెండు దశాబ్దాల కాలంలో హైదరాబాద్ నగరం అంతర్జాతీయ స్థాయి సంతరించుకొన్నది. అత్యాధునిక విమానాశ్రయం, ప్రపంచ స్థాయి షాపింగ్ మాళ్లు, సాఫ్ట్‌వేర్ పార్కులు, హైటెక్ భవనాలు సమకూరాయి. ఇవన్నీ ఆంధ్రుల సొత్తుతో చేసిన అభివృద్ధి కాదా అన్నది ప్రశ్న. అయితే ఇవన్నీ ప్రైవేటు ఆస్తులు. రాష్ట్రం ఏదైనా యాజమాన్యం మారదు. కానీ ఒక రాజధాని నగరంగా ప్రభుత్వాన్ని నడపడానికి అవసరమైన ప్రాథమిక వసతుల విషయంలో మాత్రం హైదరాబాద్‌ను ఆంధ్రుల సొత్తు అని చెప్పడానికి ఏ మాత్రం ఆస్కారం లేదు. ఆంధ్ర రాష్ట్రం ఏర్పడి అరవైఏళ్లు దాటిన తర్వాత కూడా హైదరాబాదులో ప్రభుత్వ పాలన సమస్తం నడుస్తున్నది నిజాం నవాబు కట్టించిన భవంతులలోనే అన్న నిజం విస్మరించరాన్నది. సెక్రటరియేట్, హైకోర్టు, అసెంబ్లీ, ఉస్మానియా ఆస్పత్రి, ఉస్మానియా యూనివర్సిటీ, పలు కాలేజీలు, రైల్వే స్టేషన్లు, సెంట్రల్ లైబ్రరీ, పబ్లిక్ గార్డెన్స్... ఇట్లా ఏ ప్రభుత్వ ఆస్తి చూసినా నిజాం నవాబు దూరదృష్టి మాత్రమే కన్పిస్తుంది తప్ప ఆంధ్రుల శ్రమ, పెట్టుబడి, తెలివి వ్యక్తం కావు. మనం కలిసి వున్నా, విడిపోయినా ఈ నిజాన్ని ఒప్పుకొని తీరాలి.

హైదరాబాద్ ఒక అంతర్జాతీయ నగరంగా వృద్ధి చెందడంలో ఆంధ్రుల శ్రమ, పెట్టుబడి వున్న మాట నిజమే. హైదరాబాద్ తెలంగాణ రాజధానిగా మారడం వల్ల వాటి విలువ ఎక్కడికీ పోదు. అసలు తెలంగాణతో కలవకుండా ఏ కర్నూలులోనో, గుంటూరులోనో మన రాజధాని ఆనాడు కట్టుకొని వుంటే ఇప్పుడు అవి కూడా హైదరాబాదుతో సమానంగా వృద్ధి చెందేవి కాదా అన్న వాదన వుంది. అది నిజమే. కానీ హైదరాబాదు రాష్ట్రంలో మనం వెళ్లి కలిశాము తప్ప, తెలంగాణవాసులు మనతో కలవాలని మోజు పడలేదు. నెహ్రూ మాటకు అభ్యంతరం చెప్పలేని గౌరవభావం వల్ల బూర్గుల రామకృష్ణారావు ఆనాడు హైదరాబాద్ శాసన సభలో విలీన తీర్మానం చేసి, పదవీ త్యాగం చేశాడు. నిజానికి ఆనాటికి హైదరాబాద్ రాష్ట్రం ఆంధ్ర కంటే ఎంతో సంపన్నమైనది. వ్యవస్థీకృతమైనది. అందువల్ల మనం అభివృద్ధి చేసుకొన్న హైదరాబాద్ నగరాన్ని తెలంగాణ వాళ్లు తన్నుక పోతున్నారన్న ఆవేదన అర్థరహితమైనది.

రాష్ట్ర విభజన జరిగితే ఆంధ్రులంతా హైదరాబాద్ వదలి రావలసి వస్తుందనే వాదన కూడా సహేతుకం కాదు. మన నుంచి మద్రాసు విడివడి అరవై ఏళ్లయ్యింది. అయినా ఈ నాటికీ మనవాళ్లు అక్కడ స్థిరపడుతూనే వున్నారు. రాజకీయంగా, సాంస్కృతికంగా, ఆర్థికంగా, సాంఘికంగా కీలక భూమిక పోషిస్తూనే వున్నారు. మద్రాసులో స్థిరపడిన వారికి అది పరాయి రాష్ట్రం అన్న భావన ఏనాడూ కలగడం లేదు. బెంగుళూరు విషయమూ అంతే. మన భాష కాని నగరాలలోనే మనవాళ్లకు ఇబ్బంది రానప్పుడు, మన మూలాలు వున్న హైదరాబాదులో వచ్చే సంకటం ఏమిటి? అది మన రాజధాని కానంత మాత్రాన దాన్ని వదలి రావలసిన అవసరం ఏమిటి?

విభజన తర్వాత హైదరాబాద్ ఆస్తుల విలువ పడిపోతుందన్న మాట మాత్రం నిజం. ఆంధ్రులకు కొత్త రాజధాని నిర్మాణం జరుగుతుంది కాబట్టి, కొంతకాలం కొత్త పెట్టుబడులు వుండవు. ఆంధ్ర పారిశ్రామికులు, వ్యాపారులు కొత్త రాజధానిలో నూతన అవకాశాల కోసం ప్రయత్నం చేస్తారు. అయితే హైదరాబాద్ అంతర్జాతీయ నగరం. అక్కడున్న ప్రాథమిక వసతుల దృష్ట్యా రియల్ ఎస్టేట్ ధరలు తగ్గగానే ఇతర రాష్ట్రాల వారు వలస వచ్చి పెట్టుబడులు పెట్టే అవకాశం వుంటుంది. అప్పుడు మళ్లీ పుంజుకొంటుంది హైదరాబాద్. ఆ పరిణామం వరకు ఆ నగరంలో ఆస్తుల విలువ పతనం సహజం.

# ఆంధ్రులకు ఎన్నో లాభాలు!

రాష్ట్ర విభజన వల్ల ఆంధ్ర ప్రాంతానికి నష్టం జరుగుతుందన్న ఆందోళన అవసరం లేదు. నష్టాల కంటే లాభాలే అధికంగా వుంటాయి.

## సుదీర్ఘ తీరం

కొత్త రాష్ట్రానికి వెయ్యి కిలోమీటర్ల కోస్తా తీరం వుంటుంది. అది ప్రకృతి సంపద. దాన్ని ఆర్థిక లాభంగా మలచుకోవడం మన చేతులలో పని. ఏ దేశం ఆర్థికంగా ప్రగతి సాధించాలన్నా ఓడరేవులు తప్పనిసరి. అవి మనకుంటాయి తప్ప తెలంగాణకు వుండవు. వారు కూడా దిగుమతులు, ఎగుమతులకు మన మీద ఆధారపడక తప్పదు.

## సహజవాయు సంపత్తి

ఆంధ్రకు దేముడిచ్చిన మరొక వరం – సహజ వాయువు నిల్వలు. దాన్ని సక్రమంగా వాడుకోగల్గితే కొత్త రాష్ట్రంలో విద్యుత్ కొరత అనే మాట విన్పించదు. పైగా ఖర్చు కూడా తక్కువ. విద్యుత్ లభ్యత పెరిగితే పారిశ్రామిక వృద్ధి దానంతట అదిగా జరిగిపోతుంది. ఉపాధి అవకాశాలు పెరుగుతాయి.

## శ్రీశైలం మనదే

రాష్ట్ర విభజన అందరూ అనుకొన్నట్లు రాయలతెలంగాణ కాకుండా 10 జిల్లాలకు మాత్రమే పరిమితం కావడం వల్ల కీలకమైన శ్రీశైలం ప్రాజెక్ట్ ప్రయోజనాలు మనకే లభిస్తాయి. శ్రీశైలం మీద చాలా ప్రాజెక్టులు ఆధారపడి వున్నాయి. తెలుగుగంగ, వెలిగొండ, వెలుగోడు, సోమశిల, గాలేరు నగరి, హంద్రీ నీవా తదితర ప్రాజెక్టులన్నిటికీ జల వనరు అదే. వైఎస్ రాజశేఖర్‌రెడ్డి ఎంతో దూర దృష్టితో శ్రీశైలం నుంచి వరద నీటిని తరలించే పోతిరెడ్డిపాడు హెడ్ రెగ్యులేటర్ సామర్థ్యాన్ని 40వేల క్యూసెక్కుల సామర్థ్యానికి పెంచాడు. దానివల్ల కృష్ణా నదిలో వరద ప్రవాహం 30రోజులు మాత్రమే వున్నా ఈ ప్రాజెక్టులన్నిటికీ నీరు పారించుకోవచ్చు. ఆ అవకాశం తెలంగాణకు లేదు. వారికి సంబంధించిన నెట్టెంపాడు వంటి ప్రాజెక్టులు జూరాల డ్యాం మీద ఆధారపడాలి. అది చాలా చిన్న రిజర్వాయర్. దాని సామర్థ్యం కేవలం 6 టిఎంసిలు మాత్రమే. అందువల్ల వరద వచ్చిన సమయంలో మాత్రమే నీరు పారాలి. కానీ కృష్ణా నదికి ఎడమ పక్క అన్నీ కొం

కొరవ 14వ పేజీలో

Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore. E-mail : jaminryot@yahoo.com